శ్రీరస్తు.

# పీఠిక.

---

శ్రీకుముద్వతీపరిణయము :— ఇది కాకినాడపురంబునకు సమీపమున నున్న తమ్మవరగ్రామమున నుండు చిరంజీవి శ్రీ ద్విభాషి సోమనాథశాస్త్రి రచించెను. సోమనాథశాస్త్రి యారామద్రావిడబ్రాహ్మణుఁడు. వాలఖిల్యసగోత్రుఁడు. సోమయార్యపౌత్రుఁడు. బాపనార్యపుత్రుఁడు. తల్లి వేంకటరత్నాంబ. ఇతనివయస్సిరువదిరెండు సంవత్సరములు. ఇదివఱ కీతఁడు తనమేనమామయగు కాకరపర్తి కృష్ణశాస్త్రిచే రచింపఁబడిన "సదాముక్తిసుధార్ణవ" మనుసంస్కృతవేదాంతగ్రంథమునకుఁ దెలుఁగుటీక వ్రాసెం గాని యితరగ్రంథము లేవియు వ్రాసియుండలేదు. ఇతఁడు తన మాతామహుఁడు, నుభయభాషాపాండితీవిశారదుఁడు నగు బ్రహ్మశ్రీ కాకరపర్తి వేంకటరామమనీషియొద్దఁ గావ్యనాటకాలంకారవ్యాకరణములు చదివి మంచిసాహిత్యమును సంపాదించి, సంస్కృతాంధ్రములలోఁ జక్కనికవిత్వము చెప్ప నేర్చియున్నవాఁడు. ఈతని నేను గొన్నిసంవత్సరములనుండి యెఱుంగుదును. పూర్వకవిసంప్రదాయ మొక్క త్రసరేణుమాత్రమైన మీఱి ప్రవర్తించుట కిష్టతలేనివాఁడు. ఇప్పటివ్యావహారికభాషయను గ్రామ్యమును ద్వేషించువారిలో నగ్రగణ్యుఁడు. ఏకార్యములందు నే నింతవాఁడ నని గర్వపడుట చెల్లదు. అందు ముఖ్యముగాఁ గవిత్వమందుఁ జెల్లనే చెల్లదు. ఈతం డీకాలపు చప్పిడిపోకళ్లం బోక పూర్వమార్గము ననుసరించి కవిత్వ మల్లఁగలఁడు. కవి యగువానికి తనకవిత్వమందు భయసంశయము లుండుటయే మంచిది; కాని నిర్భీకుఁడై గుటికి బారెడుగా ననునట్లు పోవుట మంచిది కాదు. ఈతఁడు తనకవిత్వమును దాను పరీక్షించుకొనుటయే కాక, పెక్కురకుం జూపి చక్కఁజేసికొను నభ్యాసము గలవాఁడు. నా కీకుముద్వతీపరిణయము రెండు, మూఁడుతడవలు చదివి వినిపించియున్నాఁడు. నే నక్కడక్కడఁ గాదు కాదు, కొంచె మించుమించుగా గ్రంథ మంతయు నీతఁడు చదువఁగా వినియున్నాఁడను.

ఇది యైదాశ్వాసముల ప్రబంధము. మొదట కృతిప్రశంస యైనపిమ్మటఁ బురవర్ణనము, దేవలోకవర్ణనము, రాజవర్ణనము, వనవర్ణనము, నాశ్రమవర్ణనము, నాగలోకవర్ణనము, స్త్రీవర్ణనము, జలక్రీడావర్ణనము, ఋతువర్ణనము, విరహావర్ణనము, సూర్యాస్తమయసూర్యోదయచంద్రోదయాదివర్ణనము, చంద్రమన్మథోపాలంభనము, నదీవర్ణనము, యుద్ధవర్ణనము, వివాహవర్ణనము లోనగు పెక్కువర్ణనములతో నలంకరింపఁబడియున్నది. ప్రతివర్ణనమందును బూర్వకవులసంప్రదాయము పొడకట్టుచుండును. శృం

శ్రీరస్తు.

# శ్రీకుముద్వతీపరిణయము

## ప్రథమాశ్వాసము.





రామామణిమోము ముద్దుఁ గొని, తత్సౌందూగచిత్రంబుపైఁ
దోరం బౌముఖనీలకాంతి బడఁ గస్తూరికనచ్చిత్రక
శ్రీరూపించెడి వేంకటేశ్వరుఁడు సుశ్రీకున్ ద్విభాషాన్వయున్
ధీరాగ్రేసరు వేంకటేశ్వరు దయన్ వీక్షించి రక్షించుతన్. 1

మ. జలధిన్ ద్రచ్చెడిచో సురాసురులు హస్తంబందు శశ్వచ్ఛుధా
కలశం బూని సమస్తభూభువనరక్షాదక్షుఁడై పద్మినీ
దళనేత్రాంశసముద్భవుం డయిన యాధన్వంతరిస్వామి ని
స్తులమోదంబున మత్కృతీశ్వరున కిచ్చున్ సంతతారోగ్యముల్. 2

మ. తనమౌళిం గలబాలచంద్రకళలోఁ దాఁగొన్న శీతత్వమున్
ఘనగంగాజలసంగతోర్మికలలోఁ గన్పట్టు నచ్ఛత్వమున్
బెనుపం గాలుకృపారసంబు తనలోఁ బెంపొంద విశ్వేశ్వరుం
డనయంజేయుత మత్కృతీశ్వరున కెంతేనిన్ మహైశ్వర్యముల్. 3

చ. పలుకువెలంది చెంగట విపంచికపై రమణీయలీల బు
క్కలఁ బలికించుచోఁ దదనుగుణ్యగతిన్ గొని కేలిప్రౌఢిరా
చిలుక పదక్రమంబుల వచింపఁగఁ దానిఁ గరోపలాలనన్
విలసితఁ జేయుధాత కృతినేతకుఁ జేయుఁ జిరాయురున్నతుల్. 4

ఉ. పాపటబొట్టుగా నుదుట భాసిలు క్రొన్నెలవంకలోని శో
భాపటలంబు మేనిపయిఁ బర్వవినీలమనోజ్ఞకాంతికిన్
దా పయి గాంగయామునకనజ్జలసంగమలీలఁ గూడఁగా
నేపు వహించుగౌరి దయ నేలు ద్విభావ్యము వేంకటేశ్వరున్. 5

తే. గీ. నిలుచుఁగా ఫలిత మోదంపు మొలకు నెనసి
కరిగిరిశిఖరిస్వామిగారాబుకలికి లచ్చి
కలికిబంగారుచూపులఁ దొలకరించు
వెరవు గలదంట, కుముద్వతీశ్వరునియింట. 6

చ. కులగిరిరాజకన్యకకుఁ గూరిమిబిడ్డ, కుమారు నన్న, వే
ల్పులనతు లెల్లఁ బ్రొద్దుఁ గొను పుణ్యచరిత్రుఁడు, కొమ్ము నెక్కు జో
దలఘుతరాంతరాయకుధరాశని, యేనుఁగుమోము వేల్పు, ని
స్తులకరుణాకటాక్షములఁ జూచు మమున్ సకలార్థసిద్ధిగన్. 7

చ. కవిజనరాజకీరసహకారమహీజము, పండితద్విరే
ఫవికచపుష్పమంజరి, దివస్పతిముఖ్యసమస్తదేవతా
నివహవనాళిచైత్రము, మునివ్రజచారుచకోరచంద్రదిం
గవఘృణి, వాణి, మా కిడుఁ గనత్కవితారచనాచమత్కృతుల్. 8

చ. కలువలవిందు, పాల్కడలికందు, కళావిసరంబుకోవ, వె
న్నెలగమిఁ గాయుతీవ, రజనీరమణీమణిచేరుచుక్క పైఁ
బొలిచెడిరవ్వ, వేలుపులబువ్వ, సుధాకిరణుండు, సమ్మదం
బొలుకఁగ మత్కృతీశ్వరునియుల్లముఁ బల్లవితం బొనర్చుతన్. 9

మ. జగతీమోదకరంబుగా సకలరక్షస్సంఘసంఛేదనం
బుగ వారాన్నిధియందు సేతురచనంబు న్జేసి దర్పోన్నతి
స్థగితావారితపంక్తికంధరశిరస్సారంబు వారించి ర
మ్యగుణశ్రీ విలసిల్లినట్టి రఘురామస్వామి మ మ్మోముతన్. 10

మ. అఘవిద్వేషణు భక్తపోషణు నజేయామేయతేజోనిధిన్
మఘవన్నుత్యగుణున్ సమస్తజగతీమాన్యప్రభావోదయున్
రఘురామస్తుతపాదపద్మయుగళీరాజన్మిళిందంబు భ
క్తి ఘటిల్లన్ నతియింతు వాయుతనయున్ గృత్యర్థసంసిద్ధికై. 11

చ. లలితరసోదయంబుగఁ గళాకలితామలసద్వనస్థలిన్
విలసితరామవృత్తము ననిందితవాక్తతిఁ బల్కు కుల్కుచున్
గలసినవామలూరుభవకీరము గీరమణీయతార్థినై
కొలిచెద భక్తిభావపరిగోపనలాలసమానసంబునన్. 12

ఉ. భాసితభక్తిమై గొలుతు భారతసద్రచనావిలాసునిన్
వ్యాసునిఁ గాళిదాసుఁ గవితానుపమానకళాధివాసునిన్
భాసుని భారతీకృతవిభాసుని హర్షు రసప్రహర్షు వి
ద్యాసముదీర్ణపాటలనిదాఘుని మాఘునపాకృతాఘునిన్. 13

మ. కమనీయస్థితిఁ బొల్చునంధ్రకవితాగంగాప్రపూరంబు వ్యా
సమహర్షీశకృపాప్తి భారతముపై స్వచ్ఛందలీలాగమ
క్రమ మొప్పన్ బ్రవహింపఁ జేసినలసత్త్వఖ్యాతికిన్ శోధితా
గమనన్నయ్యసుధీభగీరథునకున్ గైమోడ్పు సంధించెదన్. 14

కం. వివిధాంధ్రసుకవిపండిత, కవిమిత్రుం డైనయుభయకవిమిత్రుఁ గళా
నివహానుపాలనశ్రీ, స్తవనీయోల్లాసు శంభుదాసుఁ దలంతున్. 15

సీ. శ్రీనాథకవివచశ్శ్రేణీవిలాసంబు, సోమనాథుని రసస్ఫురితరచన
భాస్కరాఖ్యుని సుకీర్తిప్రాచుర్యమహిమంబుఁ, బోతనామాత్యవిఖ్యాతశయ్యఁ
జినవీరభద్రు సద్విద్యావిశేషంబు, రామకృష్ణుని పదప్రసరణంబుఁ
బెద్దనార్యప్రబంధోద్దామపటిమంబు, సూరనార్యుని యావితీరసంబు
తే. రామభూషణు సుకవితారంభగరిమఁ, గ్రమతమై చేమకూర వేంకటకవిప్ర
శస్తమృదులాంధ్రపదమతస్వాదురీతి, నరసి సరసార్ద్రమతి వారి నభినుతించి. 16

మ. నయ మేపారఁ బ్రధాన మై వివిధభూనాథాళియాస్థానులన్
ద్రయుక్తిం బాండితికిన్ నిధాన మయి శస్తం బయ్యె నెవ్వానిప్ర
జ్ఞ "యుభలౌకికవైదికా" వనఁగ మన్మాతామహున్ దత్త్వశ
స్త్రీయశుం గాకరపర్తి వేంకటమనీషిం గొల్తు మద్దేశికున్. 17

మ. నతియింతున్ గవిసార్వభౌముని గళానల్పున్ నవీనాంధ్రభా
రతకర్తన్ సుగుణాంబురాశి నతిధారాళాంతరంగున్ యశ
శ్శ్రితలీలాధనుఁ గృష్ణమూర్తివిబుధున్ శ్రీపాదవంశ్యున్ బుజు
వ్రతునిన్ మత్సమకాలికోత్తము మహోపాధ్యాయరమ్యాంకునిన్. 18

శా. రాజద్రాజసభాంతరంబుల రసప్రాచుర్యవిద్యద్వచో
రాజిం జూపి శతావధానకవితారంభంబునన్ మించు న
వ్యాజప్రజ్ఞునిఁ గింకవివ్రజపటూపంచాననున్ బాండితీ
భ్రాజిన్ వేంకటసత్కవిన్ గొలుతు శశ్వచ్ఛెళ్ళపిళ్ళాన్వయున్. 19

# శ్రీకుముద్వతీపరిణయము.

చ. నవనవకావ్యభవ్యరచనావచనప్రతిభావిలాసునిన్
వివిధరసప్రసారపరివేదిసుధీవిభవాఢ్యు మద్గురు
ప్రవరుని మేనమామ నభివంద్యునిఁ గాకరపర్తికృష్ణస
త్కవిమణి నెంచెదన్ విమలకావ్యకళావిభవాభిలాషినై. 20

ఉ. లాలితకల్పనాచణుని లౌకికభూరిరహస్యకోవిదున్
బాలితసద్గుణోత్కరు నపారకళాపరిపూర్ణ సౌమ్య ధా
రాళమనస్కునిన్ బుధవరస్తుతిపాత్రునిఁ బొందుఁ గాని యే
లీల జడున్ వరించు మృదులీల రసోచితసత్కవిత్వముల్. 21

వ. అని యిటు లిష్టదేవతాసుకవిసముపాసనంబును గుకవినిరాసనంబును గావించి
యాదిని మత్కావ్యంబునకుఁ గృతిప్రస్తావనంబు వివరించెద. 22

తే. కాళిదాసమహాకవి కావ్యరత్న, మైనరఘువంశమునఁ గుశక్ష్మాధినాథు
చరిత మేను కుముద్వతీపరిణయంబు, నా రచించితిఁ గృతి రసశ్రీ రహింప. 23

వ. ఇట్లు రచియించు నా కతిప్రియకరుం డగు నొక్కయార్యమణి వెంకట నిష్టాలాపంబు
లం బ్రొద్దుఁ బుచ్చుచు నొక్కనాఁడు మత్కావ్యం బాతనికి సాంతంబుగా విని
పింప నాతండును సంతసిల్లి. 24

ఉ. భవ్యుఁడు వైద్యశాస్త్రపరిభాషురమండనుఁ డుత్తమాతిసం
భావ్యుఁడు మా కతిప్రణయబంధుఁడు జ్ఞాతికులోద్భవుండు సం
స్తవ్యలసద్విభాష్యకులసత్తముఁ డై తగు వేంకటేశ్వరుం
డవ్యయకీర్తి దీనిఁ గొన నర్హుఁడు చూడవె సుధీజనాగ్రణీ! 25

కం. కృతి సత్కృతి వధికచమ, త్కృతిమై నిద్దాని నతని కిడి కవిరాజిన్
కృతి వౌచు నిజకులాలం, కృతి వౌచున్ మనఁగఁ దగును గీర్తిస్ఫూర్తిన్. 26

కం. అని నన్నుఁ బ్రోత్సహింపఁగఁ, బనితగుణుఁడు దీనిఁ గొనఁగఁ బాత్రుం డతఁడే
యని తలఁచి కనుఁగొనఁగ న, య్యనఘునిఁ దద్గ్రామమునకు నరిగితి వేడ్కన్. 27

తే. అరుగ నచ్చోట నన్నుఁ బ్రియంబు గదుర, నాదరము సేసి యిష్టమృష్టాన్నకలన
గారవము సేసి మామకాగమనహేతు, వడుగు నాతని కిటుల నెయ్యమున నంటి. 28

చ. సరసగుణుండ వంచు సువిశాలయశుండ వటంచు బంధుతా
దరమతి వంచు నిస్తులవదాన్యుఁడ వంచు మదిన్ దలంచి భా
స్వరరఘురామనందనవివాహకథన్ రచియించి దీని సు
స్థిరగతి నీ కొసంగఁ జనుదెంచినవాఁడను వేంకటేశ్వరా! 29

ఉ. కలరు కృతిప్రతిగ్రహణకౌతుకు లౌచు బహూకరింపవా
రిలపయి నట్టు లయ్యు మది నేను మదన్వయులైనవారికిన్
సలలితరీతి నొక్కకృతి సన్నుతలీల నొసంగఁ గోరుటన్
దలఁచితి దీనిఁ గైకొనఁగ దక్షుఁడ వీ వని ధీవరాగ్రణీ ! 30

చ. సరసియు దేవళంబును లసద్వనసంతతు లివ్వి నున్నగా
సరసత మై ప్రతిష్ఠలను సల్పితి వీజగమందు నీయశః
కిరణము పర్వ దిక్కుల కొగిన్ మఱి యొండె కొఱంత గల్గె భా
స్వర మగుసత్కృతిన్ గొనుట సంతతులం దిది తీర్పఁ జెల్లదే. 31

తే. బ్రాహ్మణుండవు వైదికాన్వయుఁడ వందు, నాదువంశీయుఁడవు కళామోది విద్ది
గైకొనఁగ నీకె చెల్లును గాక యనుచు, మదిఁ దలంచితి నధికసమ్మదముతోడ. 32

తే. భవ్యతర మైనసత్కీర్తి వన్నె కెక్క, యవని నాచంద్రతారార్క మలరులీల
నిర్వ్యరముఁ గృతికర్తృభర్తృత్వరీతి, నెనసి వెలయింపఁ జెల్లదే మనకులంబు. 33

వ అనిన నతండును మహామోదంబు నొంది యిట్లుగా వచియించె. 34

మ. వినయోల్లాసివి పిన్నవాఁడవు కనద్విద్యాసముగ్రుండ వ
త్యనఘస్ఫూర్తివి మత్కులోద్భవుఁడ వీ వైయుంటు నీచేత మా
ననరీతిన్ గృతి నందుకంటె నభివర్ణ్యం బౌ మహానందసం
జననం బున్నదె మాకు వేఱ నిఁక వత్సా! సోమనాథాహ్వయా! 35

సీ. వినుతవిద్యాసమోపేతుఁ డై చలమయ్య, హ్వయుఁడు మాముత్తాత వాసిఁ గాంచె
నఖిలలౌకికరహస్యజ్ఞాత మాతాత, సోమయార్యుఁడు వసుస్ఫురితుఁ డయ్యె
నార్యానువర్తనం బంది మాపెదతండ్రి, సోమయార్యుఁడు యశస్ఫూర్తిఁ గనియె
వైద్యసద్విద్యానవద్యుఁ డై మాతండ్రి, బాపనార్యుఁడు ప్రథన్ బ్రబలుచుండె

తే ఘనత గలవారు మావారు గాన నట్టి, వంశమునఁ బుట్టి కవితావిభాసి వీవు
వినుతగతి మాకుఁ గృతి నీయఁ గొనుటకంటె, యౌచితీరస మున్నదే యరసి చూడ. 36

వ. కావున నీ కావ్యరత్నంబు నాకొసంగు మని కర్పూరతాంబూలాదులచే నన్నున్ బహూకరించి పరితుష్టుం జేసె నిఁక మత్కృతీశ్వరు వంశావతారవర్ణనక్రమంబుఁ జెప్పెద. 37

చ. పరమతపోధనాధికులు పంకజసంభవమానసోద్భవుల్
పరిచితసర్వవేదు లతిభవ్యమతుల్ సకలార్థకోవిదుల్

సురనుతిభాజనుల్ తరణిశోభితతేజులు సంతతోర్జితా
చరణులు వాలఖిల్యమునిచంద్రులు పొల్తురు కీర్తిసాంద్రులై. ౩౮

ఉ. ఆమునినాథచంద్రములయన్వయమందు విరాజిలెన్ ద్విభా
ష్యామలినోపనామకసమంచితుఁడై సుగుణానుభావశో
భామహనీయతన్ యశము వర్ధిలఁ బట్టెయధీవరుండు గో
త్రామరశేఖరుం డగుచు నాత్మకులంబు వెలుంగఁజేయుచున్. 39

కం. ఆమహితుఁడు కనియె బుధో, ద్దామహితునిఁ గృష్ణయాభిధాను నతండున్
గామితకీర్తిస్తుతభో, గామితుఁడై వెలసె సదుదయాంచితుఁ డగుచున్. 40

చ. విచికిలమల్లికాకుసుమవిభ్రమమున్ హరియించి చంద్రికా
రుచుల హసించి నూతనసరోరుహదీప్తుల నొంచి కైతక
ప్రచయముఁ బెంచి మౌక్తికనిభప్రభఁ గాంచి పటీరహీరరు
క్ప్రచురత మించి యాద్విజునిభవ్యయశోవిసరంబు భాసిలున్. 41

చ. వినుతగుణాలి యై విబుధవిశ్రుతుఁడై తగు కృష్ణయాభిధా
నునకును సాధుశీల సుమనోజ్ఞగుణాంకిత పాపమాంబయన్
దనయుఁడు పొల్చె బుచ్చయ యనన్ ఘనుఁ డార్యహితైకవర్తనుం
డనఁ దగి బాపమాంబిక ప్రియుం బలరన్ దనధర్మపత్నిగన్. 42

కం. ఆభూసురజనతాగ్రణి, భాభాసురసద్యశోవిభాశుభవిభవ
ప్రాభాతసమయవికసిత, శోభాతరశార్యహృదయశుచిపంకజుఁడై. 43

మ. తనవంశానుగతంబు వైద్యఘనవిద్యారాజ మవ్యాహతిన్
జననాథాదృతమై తగన్ వివిధసంస్థానంబులన్ జేసి సి
ద్ధనిరూఢైకచికిత్సచే నమృతహస్తత్వంపుఁ బెం పొంది నూ
తనధన్వంతరి నా యశమ్ముఁ గనియెన్ దజ్ఞుల్ ప్రశంసింపఁగన్. 44

తే. వైద్యసద్విద్య వీరింట వన్నెకెక్కెఁ, జాల ననుకీర్తి దేశదేశముల వెలయు
నధికశిష్యప్రశిష్యాగ్రనాఘ్యుఁ డగుచు, బఱలె ననవద్యసునవైద్యఖ్యాతిఁ గాంచి. 45

ఉ. ఆయనఘాత్మకాశిసుతు లై జనియించిరి కృష్ణయాఖ్యర
మ్యాయితకీర్తి వెంకయమహామహితాత్ముఁడు సుబ్బయాహ్వయుం
డాయతకీర్తులై మువు రుదంచితపావనతన్ ప్రదీప్తిమా
లాయుతతేజమందు ననలత్రితయంబును బోలి లీలమై. 46

ఉ. వారలలో ద్వితీయుఁ డభినంద్యుఁడు వెంకయనాముఁ డంచితో
దారగుణాఢ్యుఁడై సుగుణతాసముదీర్ణకు నన్నపూర్ణకున్
మా రసరీతి వొల్చు సుషమాపరిపూర్ణను బూర్ణమన్ సతిం
గా రహిమై గ్రహించి యతిగౌరవలీల మెలంగ నెంతయున్. 47

మ. దేవోత్పన్నము వైద్యశాస్త్ర మనురక్తిన్ దద్రహస్యైకబో
ధావాసుం డగుతండ్రిచెంతనె క్రమాభ్యాసంబుఁ గావించి మే
ధావైపుల్య మతుల్యమై పరఁగ శస్త్రం బాయశం బందె "నా
త్మావైపుత్ర" యటన్నసుద్ది యను వొందన్ దండ్రి పెన్నద్దియై. 48

సీ. చేయి వట్టి చికిత్సఁ జేసెనా గదరాజి, యడఁగెఁ గాని యసాధ్య మగుట లేదు
ఆస్థానముల కేగినా యందలంబుపైఁ, గాని కాల్నడక నేఁగ లేదు
ఘనబహూకృతు లందుకొనితెచ్చెనా వేల, కును వేలెగాని తక్కువగ లేదు
అరసి బీదలకు వైద్యముఁ జేయఁ గడఁగెనా, యుచితంబె కాని వేఱొండు లేదు
తే. గురుతరనిదానమున వస్తుగుణము నెఱుఁగఁ, దనకుఁ దా సాటి గాని యన్యునకుఁబోలఁ
దలఘుతరవంశనవరత్నహారతరళ, కల్పుఁ డధిగతభైషజ్యకల్పుఁ డతఁడు. 49

సీ. చెలువుమై యొక్కచోటఁ జేయిఁ జాపనియట్టి, తనవంశమర్యాద మనఁగఁ జేసి
వైద్యవిద్యాప్రభావంబుచే దిశలెల్ల, వెలుఁగంగ సత్కీర్తి వెలయఁ జేసి
తనకంటె నుత్తమోత్తముఁడు లేఁ డనుసాధు, బృందసంస్తుతులఁ బెంపొందఁ జేసి
సత్యప్రవర్తనాసరణిచే నిసుమంత, యొడలేనివిఖ్యాతి నెదుగఁ జేసి
తే. బందుగులలోన గౌరవం బంది మించి, సన్నతాచారపరతచే వన్నె కెక్కి
వినుతధర్మానుగుణవృత్తి విస్తరించి, వెంకయార్యుండు తగ సద్వివేకి యగుచు. 50

కం. ఆవిప్రునియర్ధాంగి న, యావహతన్ వెలసె భర్త కనుగుణలీలన్
బావనశుభలక్షణముల, బ్రోవనఁ బూర్ణమ కడుం బ్రపుణ్యాత్మక యై. 51

ఉ. ఆమహనీయదంపతుల కాత్మజులై జనియించి రంచిత
శ్రీమహిమల్ తగన్ గుణవిశిష్టుఁడు బుచ్చెయధీవరుండు స
ద్ధీమణి వేంకటేశ్వరుఁడు రమ్యగుణాఢ్యులు సుబ్బరాయనా
మామలవేంకటాచలసమాఖ్యులు నల్వురు నల్వమీఱఁగన్. 52

తే. సోదరులు నల్వురును సమర్యాదులగుచు, సరళసౌభ్రాత్రగుణనివాసంబు లగుచు
నొప్పి రందుల జ్యేష్ఠసహోదరుండు, బుచ్చెయార్యుండు తగ యశస్ఫూర్తి మఱియు.

తే.గీ. కలిమితోఁ బారితనపు మంచి పెలవరంగ, సుగుణపరిపూర్ణతలఁ బెంచు చొప్పనంగ
బంధుగౌరవమున కాటపట్టునంగ, మీఱె నాతండు సముచితాచారుఁ డగుచు. 54

చ. స్థిరతరకీర్తి యందుల ద్వితీయుఁడు మత్కృతిభర్త వేంకటే
శ్వరుఁడు నయానుకూలమృదుభావమునన్ బుధలోకసత్క్రియా
పరతను, దైవకార్యపరిపాటిని, సంపద, నర్థిసంతతా
దరమున, సాటిఁ గాంచనివిధంబున మించుచు నొప్పు నొప్పుగన్. 55

చ. జనకునిఁ బోలియే యఖిలశాస్త్రరహస్యము లెల్లఁ దండ్రిచెం
తనె తమి నభ్యసించుక నిదానమునం దసమాన మాచికి
త్సను గడిఁదేఱి ధీరుచిరతన్ దనపిన్నటనాఁడె కీర్తిచం
దనలతికావితానముల నాఁటె దిశావనవాటికాతటిన్. 56

తే.గీ. లలితవర్షాసముద్భూతలతిక వోలెఁ, గలితసితపక్షనవచంద్రికళయు వోలెఁ
దనదుసద్వైద్యకళయు నిత్యప్రసిద్ధి, నాఁడునాఁటికి నవనవోన్నతి వహించె. 57

సీ. అనవద్యవైద్యవిద్యామహావిఖ్యాతి, యాంధ్రదేశము దాఁటి యవలఁ జిమ్మ
సరసమౌ నమృతహస్తఖ్యాతివిభవంబు, వరయశోన్నతికిఁ బైమెఱుఁగు వెట్ట
నూరూరఁ దనఘనాయుర్వేదనవసుమ, స్నిగ్ధవల్లరి ప్రాఁకి చిగురు లెత్త
నానాఁటికిని నిజోన్నతవైద్యవిభవంబు, కమలావధూటిఁ దాకట్టుఁ గొనఁగ
తే.గీ. తనమహౌదార్యకల్పకం బనుదినంబుఁ, గొరలి శాఖోపశాఖమై గలలు వైవ
నింతయును వైభవంబున కెడమ లేక, యెసఁగు వనయంబు శ్రీవేంకటేశ్వరుండు. 58

సీ. వడి నిల్పెఁ బాలవాగుడిని ధన్వంతరి, స్వామికై తనకీర్తి వన్నెకెక్కఁ
గట్టించెఁ బంకజాకరము తెల్లెడ నిజో, ద్ధురగుణావళి యందుఁ బరిమళింప
నాటించె సహకారవాటికాచయముఁ ద, ద్వ్యాజమై తనదుపుణ్యము ఫలింపఁ
ద్రవ్వించెఁ గూపసంతతులఁ దన్మకనిజో, ద్దీపితాదాగ్యంబు తేటపడఁగ
తే. సరసగతి వాపికను ధర్మశాల నొకటి, వెలయఁగాఁ జేసెఁ దనపేరు విస్తరిల్ల
వర్ణితామేయసుగుణభాస్వరుఁడు వేంక, టేశ్వరుం డన నొరు సాటియే తలంప. 59

ఉ. సత్యవచోనిరూఢిని విశాలమనస్కృత సాధులోకసాం
గత్యమునన్ సమంచదుపకారధురీణత శాంతిభావసా
తత్యమునన్ నిగర్వసముదారగుణంబుల నాత్మబంధుసం
తత్యభిమానశీలత ననన్యుఁడు మాన్యుఁ డితం డనం దగన్.

తే. సుగుణగణధుర్య తనభార్య సూరమాంబ
యాత్మజుఁడు సూర్యనారాయణాహ్వయుండు
తనకు ననువర్తి యై నిత్యమును మెలంగ
సిరుల సంతతిఁ గడు బ్రశస్తిని వహించె. 61

సీ. పరితిపట్టణమున సద్వైద్యమందిరరాజి, నిల్వరించె నయంబు వెల్వరించెఁ
దనబాంధవులకు వేతనము లిచ్చి దయాప్తిఁ బరిస్తరించె గుణాళి విస్తరించె
నతిగుప్త మైన వైద్యరహస్యములనెల్ల, వెల్లడించె ననీతిపెల్లుడించె
వంగబంగాళాదిబహుదేశముల వైద్య, గరిమఁ జూపె రుజార్తిభరము ద్రోపె

తే. తనదుసోదరులకు సదాదరముఁ జూపి, వృద్ధికిం దెచ్చె సత్యపరిసిద్ధిఁ గాంచె
వరపరిజ్ఞానసంపాది వైదికాన్వ, వాయవార్ధిందు డగుచుఁ జెల్వంబు నిల్వ. 62

ఉ. తాతలనాఁటిపద్ధతిని దానె కుమారున కాయురాగమం
బాతతలీల నేర్పి గురు వై నెజేఁ గాంచుటె కాక లోకవి
ఖ్యాతి గడింపఁ జాలిన తనంతటివిశ్రుతవైద్యశిష్యసం
జాతము న్వేరించె ననిశమ్ము నిజపరిథ లుర్విఁ బర్వఁగన్. 63

వ. ఇట్టిమహనీయగుణోత్కృష్టుం డగు మత్కృతిశ్వశురునకు. 64

కం. ఐశ్వర్యధూర్వహునకున్, శాశ్వతసత్కీర్తివిభవసముదీర్ణునకున్
విశ్వనుతసారసద్గుణ, శశ్వద్గణమణికి సత్యసంధాగ్రణికిన్. 65

కం. మిత్రాంబుజాతభాస్వ, న్మిత్రునకున్ వాలఖిల్యనిత్యస్తుతస
ద్గోత్రునకు గౌరవాధిక, పాత్రునకు ద్విభాష్యవంశవనచైత్రునకున్. 66

కం. పోషితనిఖిలాశ్రితసం, తోషునకు నుదారభావనుతభూషునకున్
బూషోపమానదీప్త్య, శ్లేషున కత్యంతమధురమృదుభాషునకున్. 67

కం. రాజసమవైభవునకున్, రాజితవిఖ్యాతవైద్యరాజాగ్రణికిన్
రాజీవగాద్విశానీ, రాజితగేహాంగణాతిరమ్యస్థలికిన్. 66

కం. శాంతునకు సుప్రకాశా, శాంతునకు నితాంతసంవిదాధిక్యకృశా
శాంతునకు మణిగణాంకని, శాంతునకు లసద్దయారసస్వాంతునకున్. 69

కం. వివిధాంధ్రదేశనగర, ప్రవరమహావైద్యఘనసభాసముపాత్త
స్తవనీయరత్నపదక, ప్రదీక్షాలంకృతికి మహితధర్మాదృతికిన్. 70

కం. సురుచిరధీరజనాగ్రే, సరునకుఁ బ్రాయోన్నదానసంప్రీణితభూ
సురతతికిఁ బూర్ణమాంబా, పురంధ్రికాగర్భశుక్తిముక్తామణికిన్. 71

కం. ప్రీణితసకలమహాంత, ర్వాణికి శ్రీవేంకటేశ్వరద్విజమణికిన్
క్షోణీనుతభాగవతపు, రాణశ్రవణానురాగరంజితమతికిన్. 72

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మద్విరచితం బగు కుముద్వతీపరిణయం బను మహా
ప్రబంధంబున కుపక్రమం బెట్టి దనిన. 73



# కథారంభము.



శా. శ్రీకల్యాణసమాశ్రయంబు సుమనశ్శ్రేణీనివాసంబు నా
నాకామ్యార్థచయప్రదాతృఘనసంతానంబు సౌధాళిరు
చ్యైకశ్రీమహితం బయోధ్య యనుపూరింద్రంబు భాసిల్లు సు
శ్రీకంబై చతురబ్ధివేష్టితధరిత్రీమండలస్వర్గమై. 74

శా. వాతాంకూరపరంపరాపరిచలస్వర్వాహినీవీచికా
వ్రాతాస్ఫాలిత మౌ తదున్నతపురీవప్రంబు మాద్యన్మరు
త్మాతంగంబు తదాపగానికటకాంతారంబులందుండి యు
ద్ఘాతక్రీడ నొనర్పఁ దాఁకును చతుర్దంతప్రహారార్భటిన్. 75

చ. సరసతచే గభీరగుణసంగతి లోకహితైకజీవన
స్ఫురణతఁ దన్ను భోగవతి పోలు నొకో యని దాని నుద్ధతిన్
దొరఁకొని యాహవంబున నధోగతిపా లొనరించి తత్పురా
త్యుపపరిఖాలలామము మహోర్మిసమున్నతిఁ గాంచి మించెడున్. 76

మ. సురభూజవ్రాతగంధవన్నవసుమస్తోమంబు లెల్లన్ బురాం
తరసౌధాగ్రములన్ జరించుప్రియసక్తప్రేయసీపాళికిన్
స్మరబాణప్రకరంబులై సురటులై శయ్యావితానంబులై
వరమూర్ధాభరణంబులై సరములై భాసిల్లు నానాగతిన్. 77

కం. పురి నున్నతంబు లగు న, ప్పురిగలచే సూర్యరశ్మి పర్వక యున్నన్
గర మామణిసౌధంబులె, వరసితరోచిర్మ్రపాతపంబులఁ గొలుపున్. 78

చ. పరుల కశక్య మిందుఁ జొరఁబాఱఁగ నంచుఁ బవిప్రహారదు
ర్భరతరభీతిఁ దత్పురవరంబునఁ జేరి వసించుపక్షసం
భరితధరాధరేంద్రములభంగి విశాలతరశ్రవఃపరి
స్ఫురితగజేంద్రమండలము పొల్చుఁ బురిన్ సముదంచితోన్నతిన్. 79

మ. క్రమతన్ ధావనవేళఁ దత్పురతురంగవ్రాత ముచ్చైశ్శ్రవ
స్త్వము నత్యాసుగవర్తనం బతిబలత్వంబున్ మనోవృత్త్యను
క్రమణోద్యద్గమనంబునుం గలిగి ప్రఖ్యాతిన్ వహించున్ శుభో
త్తమసల్లక్షణలక్షితామలతనుప్రస్తేందుబింబాభమై. 80

ఉ. ఆపురబాహ్యసీమలవిహారవనంబులు పొల్చు కోకిలా
లాపములన్ బ్రసూనవిచలన్మధుపధ్వనులన్ ఫలోదర
వ్యాపృతసద్రసాధ్యశనహారిశుకీనినదంబులన్ సము
ద్దీపితకేకిలోకసముదీరితసుందరషడ్జసుశ్రుతిన్. 81

ఉ. మానితధీసమున్నతి సమర్త్యగురున్ ఘనమాఘ్యసంయుతుం
గా నిరసించి సత్త్వగుణగౌరవమున్ గనియుంటఁజేసి వా
ణీశు రజస్స్వరూపునిగ నెంచి కళాతతియందు శేషభో
గీశు నధఃకరింతురు మహీనుతిభాగ్భుజు లప్పురద్విజుల్. 82

చ. నిరతము బాహువున్ హృదయనీరజమున్ సుగుణాంకితంబులై
వరలఁ గటాక్షభవ్యవిభవంబు శ్రుతిద్వయి శ్రీవిలాసమున్
దొరయ ముఖంబు సూక్తివితతుల్ సతతంబుఁ గళానిధిత్వవి
స్ఫురణముఁ దెల్పుచుండ నృపసూనులు పొల్తురు తత్పురంబునన్. 83

మ. పురిలోఁ గల్గు కిరాటకోటిభవనంబుల్ గొప్పలై నిత్యమున్
వరపద్మంబులచే వెలుంగుచు ముకుందభ్రాజులై యొప్పఁగా
నరవిందాలయ యైనలక్ష్మికి నివాసామేయధామంబులై
కర మొప్పారె నటన్న వింత గలదే కళ్యాణభాగ్యోన్నతిన్. 84

ఉ. ఉన్నతహేమశైలశిఖరోచ్ఛ్రయసామ్యముఁ గాంచి పెంపునన్
మిన్నులు ముట్టు కర్షకవినిర్మితభాసురధాన్యరాసు లు
ద్యన్నిరతార్థలబ్ధి వెలయం దగఁ జేయు సమస్తసస్యసం
పన్నతఁ గాంచుప్రోల గరిమన్ దులఁదూఁగుచు నెందుఁగాంచినన్. 85

సీ. మిలమిలలాడు కేనలిసోయగముఁ జూపి, కామాంధకారమగ్నముగఁ జేయుం
మిరుమిట్లుగొలుపుక్రొమ్మెఱుఁగుఁజూపుఁ జూచి, కంతుబాణముల కగ్గలము సేయుం
అధరవిద్రుమదీప్తు లలవరింపఁగ నవ్వి, వితతానురాగరంజితముఁ జేయుం
కుచకుంభముల వింతకొమరుఁదోపఁగఁ జూపి, లలితశృంగారవార్ధులఁ దేల్చు
తే. వచనరచనాచమత్కృతుల్వాఱలఁ బల్కి, హృదయమానందరససుధాస్పదముఁ జేయుం
చక్కఁదనమున దేవవేశ్యలను గెల్చి, సరసజనపాళి నచటి వేశ్యాజనాళి. 86

చ. వలపులఁ జిందుచెంగలువబంతులు సంతతరాగదీప్తులన్
గొలిపెడుమావిలేఁజిగురుగొమ్మలు తీయదనంపునింపులన్

దెలిపెఁ జిన్నిపూవునఁ దేనెలు సొంపుల నింపుమల్లెతీ
వలనన లాలతాంగు లనివార్యవయోరుచిరాంగసంపదన్. 8

చ. అనయము ప్రోలఁ గల్గుజవరాండ్రముఖంబుల కోడి లజ్జనుం
గాని శశియే కళల్ దఱిఁగి కుందఁ దదీయసతీవితానమై
యొనయును శుక్రకాండము లవెంతటిచక్కనిచుక్కలైన యా
వనితలకాలిగోళ్లకెన వచ్చునొకో యిఁక నెన్నిభంగులన్. 88

చ. తమదరహాసకాంతిసముదాయముచే రుచి మీఱుపూవుమొ
త్తములఁ జిగుళ్ళఁ గూర్చి వినుతక్రియ నెత్తులఁ గుట్టి విల్తురం
దము లనువందఁగా యువజనంబులకున్ గనువిందుగా విమో
హముఁ గొలిపించుమందులుగ నాపురమందలిపుష్పలావికల్. 89

చ. కుముదదళాక్షి! నీదుపలుకుందము లెంతయు మానసాభినం
ద్యము లయి తోఁచె నీవలపు నందమనమ్మ రుచించె శోభనీ
యము లగు నీసువర్ణములటంచుఁ బురంబునఁ బుష్పలావికా
సముదయమున్ విలాసిజనసంతతి మేలము లాడు వేడుకన్. 90

చ సరయసరత్ప్రవాహవిలసద్విమలాంబుతరంగమాలికా
సురుచిరడోలికానికరశోభితరాజమరాళరాజియై
సరయు వసన్ సరిద్వర మెసంగు హసజ్జలజాతసౌరభో
త్కరసురభీకృతానిలము తన్నగరీనికటస్థలంబునన్. 91

ఉ. ఆనదిలోనఁ బొల్చుశిశిరానిలుఁ డంబుజసారసౌరభం
బానుచు నిత్యమున్ దనివి నందక కేయి రతి న్మెలంగి యిం
పొనిడుమేడలన్ నిదుర నందెడుజోంట్ల ముఖాబ్జవాసనల్
పూనఁ జరించు నానగరిలో నతికాంతనిశాంతవేళలన్. 92

కం. శ్రీరామతనయుఁ డధిక, శ్రీరామతఁ గాంచి తత్పురీవర మేలున్
రారాజు కుశుఁ డనంగన్, రారాజద్యశుఁ డనంగ రమ్యాకృతియై. 93

మ. తనసామ్రాజ్యమునందుఁ గల్గుజనసంతానంబు నంచత్కృపన్
దనసంతానముఁ గాఁగఁ జూచుఁ గుశగోత్రానాథుఁ డర్థార్థినా
తనసంతానమహీజమై సతతమున్ ధర్మక్రమాచారచిం
త ననంతానుపమాగ్రహారముఖసంతానప్రతిష్ఠాతయై 94

సీ. తనశత్రుభయదసత్త్వస్ఫారఘనభుజా, లత యశఃకుసుమసంతతుల నీనఁ
దనదానవారిసంజనితనిర్మలసరి, ద్వరము కల్పకపాదపములఁ బెనుపఁ
దనయశోమండలోద్భవసితద్యుతి హిమ, ద్యుతిమండలముఁ గళంకితము సేయఁ
దనశౌర్యతేజఃప్రతాపంబు లాత్మప, త్కులనాథు దిననాథుఁ దలఁపఁజేయ
తే. నర్యమాన్వయభవరత్న మగుచుఁ దనరు, మండితాఖిలరిపురాజమండలప్ర
చండదోర్దండవిక్రమస్ఫారహరణ, విశదశౌర్యక్రియానిరంకుశుఁడు కుశుఁడు. 95

చ. ప్రజ కనుకూలవృత్తిపరిపాలనసేఁతకె యౌవనంబు ది
గ్విజయసమార్జితం బయినవిత్తము లర్థిజనాదరార్థమే
సుజనులఁ గాచి దుష్టపరిశోషణముం బొనరించుచుంటకే
భుజబలవిక్రమక్రమముఁ బూను నతం డతిభవ్యశీలుఁడై. 96

మ. కసి తీఱన్ రిపురాజసంఘముల సంగ్రామంబులన్ జెండఁగా
నసిధారావ్రత మూని యావిభుఁడు బాహాభాసురోగ్రాసిచే
విసరద్వైరిమదేభకుంభతటముల్ భేదించి ముక్తామణీ
విసరంబుల్ తలఁబ్రాలు సేయు మహితప్రీతిన్ జయశ్రీలకున్. 97

ఉ. అర్థిపదంబు ధారుణి నిరర్థకతన్ వహియింపకుండ న
ప్పార్థివసత్తముం డలఘుభాగ్యదమావిభవంబు పేర్మిఁ బ్ర
త్యర్థిని దా నభీప్సితఫలాప్తమనఃప్రమదాఢ్యుఁ జేసి ప్ర
త్యర్థినిమాత్రమే సతముఁ దాఁ గనఁజేయు నిరర్థకత్వమున్. 98

చ. అమలినవిక్రమక్రమవిహారగతిన్ రిపురాజపట్టణా
క్రమణ మొనర్ప నేగుతఱిఁ గాంచనరత్నవిభూషితాంగియై
తమి నెదు రేగుదెంచు గజతండముతో రిపురాజ్యలక్ష్మి య
ర్యమసమతేజుఁడై పరఁగు నన్నరనాథునిఁ బొందు వేడుకన్. 99

చ. అనయముఁ జూడఁ డాశ్రితజనావళికై సదయాంతరంగుఁడై
యనయముఁ జూచుఁగాని శరణాగతులౌ పరిపంథిపాళిపైఁ
బెనుపఁగఁ బూనఁ డిద్ధగుణవిస్తృతనిర్మలకీర్తివల్లరిన్
బెనుపఁగఁ బూనుఁగాని పృథివీరమణాన్వయరత్నభూవరుఁడై. 100

ఉ. ప్రాపితరూపుఁడై కుసుమబాణుఁడు వచ్చినఁగాని యిర్వురన్
రూపమునందు వేఱుగ నిరూపణముం బొనరింపలేనియ

ట్లా పృథివీశ్వరుఁడు మహితాకృతితో రహిఁ గాంచు నిట్లు త
ద్రూపవిశేషలీల కనరూపము లైనగుణంబు లొందుచున్. 101

చ. అతనికటాక్షకాంతిలవ మబ్బినచో నదె భాగ్య మంచు స
న్నుతముఖమండలద్యుతిఁ గనుఁగొన నయ్యదె రాజయోగమం
చతితనుమధ్యమస్థలము నారసినంత నదే యదృష్టమం
చతులముదాప్తిమై యతని నాత్మఁ దలంతురు రాకుమారికల్. 102

వ. ఇట్లా రాజగ్రామణి విరాజితతేజోనభోమణియై నిజయశస్సాంద్రచంద్రికాధవళీకృతనిఖిలలోకుండై యశేషవిభవవిశేషరమానిస్తంద్రుఁ డగుటంజేసి భూలోకపురందరుండై యవక్రపరాక్రమక్రమంబునఁ ద్రివిక్రమస్వామి ననుక్రమించి మోహనకలాకలాపకలాపకలనాసమానశౌర్యపరిప్రీణితరాజకుమారుండై యా రాజకుమారుండు విలసిల్లుచుండి. 103

మ. ఒకరాకారజనీలసత్సమయమం దుత్తుంగహర్మ్యాగ్రమం
దకలంకాయతరత్నకుట్టిమముపై నంభోజనేత్రల్ విపం
చికలన్ మీటుచుఁ బాడఁగా విని సుఖశ్రీఁ దేలి సంఫుల్లహ
ల్లకపాళీపరికల్పితం బయిన తల్పంబందు నిద్రింపఁగన్. 104

చ. తన కుపనీతమై విమలధర్మపథానుగమక్రియైకబో
ధనుఁ డయి సర్వవిద్యలకుఁ దాన గురుం డయి యొప్పు సద్యశో
ధను మునిరాజచంద్రము నుతస్థిరభావుని వామలూరునం
దనుఁ గని యద్భుతం బెసఁగఁ దన్మహినాథుఁడు స్వప్నమందుఁ గన్. 105

శా. ప్రాతర్వేళను మేలుకాంచి సతతవ్యాకోచసమ్మోదవ
చ్చేతస్కుం డయి కాల్యకృత్యవితతిన్ శీఘ్రంబుగాఁ దీర్చి వి
ఖ్యాతశ్రీవిభవాభిశోభితసభాభ్యంతస్థలాంచద్ఘృణీ
జాతద్యోతితరత్నపీఠగతుఁడై సభ్యవ్రజంబుల్ వినన్. 106

మ. కెలనన్ గల్గినమాత్యమౌళి నొకనిన్ గ్రేగంట నీక్షించి నే
దలవల్మీకభవాశ్రమస్థలికి ముఖ్యామాత్యసన్మిత్రనుం
దలితో మే మిపు డేఁగఁగావలయుఁ గానన్ దత్ప్రయాణోచితా
ఖిలసన్నాహముఁ జేయ నానని వివక్షీభూతముఖ్యార్థుఁడై. 107

వ. ఇటులం బలికి తత్తదమాత్యాదిజనంబులఁ దగుప్రయాణోన్ముఖులుగా నుండ నియమించి నాఁటిఁ గొడ్డోలగం బుడిపి తానును బ్రయాణోన్ముఖుండై నిజావరోధంబునకరిగి కృతభోజనుండై వీటీసేవనం బాచరించి. 108

ఉ. తెల్లని యంచ రెక్కలకుఁ దీసువుఁ జెప్పఁ బుసంగు లొప్పనై
నల్లఁగఁ దాల్చి యుల్లిపొరయంతటిపల్చనదై మెఱుంగుసం
ధిల్లఁగఁ బొమ్ముకూసముగఁ దిన్ దగు సన్నని యంశుకంబు భూ
వల్లభపాళి మౌళిముగఁ బాగొనరన్ రచియించి మించుగన్. 109

చ. జిలజిలలాడుమాత్రి యపుఁ జేవలచే వలఁగొన్న పట్టుక్రొం
దళుకుఁ దురాయి దానిపయిన న్గదియించి మెఱుంగురంగురం
జిలఁ జెలువారి సన్నఁబసఁ జిల్కుబెడంగుకడానిదుప్పటం
బలరఁగఁ బైధరించి మహితాకృతితో మహీపాలుఁ డెంతయున్. 110

వ. ఇట్లు కృతవేషుండై పంచాననంబు వంచింపఁ జేయుగంభీరగమనంబుల సింహద్వారంబు
కడకు సేరం జని యంతకుమున్న యచటఁ గృతాశ్వపరిష్కారంబులై వరుసగ నొక్క
టొక్కట నిలువం బెట్టఁబడియున్న వెండిగుండ్లను బోని తెల్లనివారువంబులఁ దానును
తక్కుంగలవారలును గ్రమంబుగ నధిరోహణంబుఁ జేసి పురంబు వీడి ఖలీనంబుల
సడల్చినప్పుడు. 111

సీ. నవరత్నచితఖలీనప్రభావళి నభః, పథముపై నింద్రచాపంబు గాఁగఁ
బటుఖురాంచలసముద్భవధూళి దివిఁ జేరి, సాంద్రనీలాంభోదసమితి గాఁగ
వియదుద్గమనకేళి విశదఫేనపంక్తి, లలితసౌదామినీలతలు గాఁగఁ
గళలసత్కింకిణీగణమణీఘృణి రాజి, సలిలధారాసహస్రములు గాఁగ
తే. మహితగతి దోఁప వర్షాగమంబుఁ బోలి, చూపఱుదృశావళికి వింతఁ జూపి యిటులఁ
దత్తురంగముల్ సముద్దండలీల, నధికరయ మూని కొంతద వ్వరిగి యరిగి. 112

ఉ. తుంగములై సితద్యుతులతో నలరారుచుఁ గానవా స్వకీ
యాంగము లాహరుల్ ధరణి నంటి చెలంగఁగ నల్లనల్లనన్
గ్రుంగి రయంబుతోఁ జనఁగఁ గోచరమౌఁ గనుదోయి కిట్లు మిం
చుం గని నేలఁ ప్రాఁకికొనుచుం జను శేషఫణీంద్రులో యనన్. 113

వ. మఱియును గమనాతిరేకంబున సూక్ష్మపరిదృశ్యమానతనూచయంబులై యాసిత
హయంబు లతిరయంబునఁ జనునప్పుడు. 114

చ. అలరి నభఃపథంబుపయి నంచలు బారుగఁ బోవునట్లుగా
నిల నవి యొక్కబారుఁ గొని యేగుచు నంతవె వెండితీఁగ లిం
పొలయఁగ సాగునట్టిచెలువొంది క్రమక్రమలీల నేకమై
తెలుపుజిలుంగుదావమును దీయురహిన్ వహియించు నెంతయున్. 115

కం. రంగద్గతితో నిటులు తు, రంగము లుల్ తత్తిఱఁ జనెఁ దురంబు బడి యురుదా
రంగన్ జలజచలత్వా, సంగరవాసంగ నురుతరంగన్ గంగన్. 116

మ. స్థిరసత్త్వంబులు వాజు లాత్రిపథగాతీరంబు సేరం జనన్
ధరణీనాథుఁడు వారువంబు డిగి యంతన్ వెక్కురున్ గొందఱన్
బరివారంబులఁ బంచి ముఖ్యసచివవ్రాతంబుతోఁ దన్నదీ
తరణంబున్ బొనరించె మోదమహితౌదార్యం బవార్యంబుగన్. 117

వ. ఇటులు తరంగిణీతరణంబు సేసి సమున్నతశిఖరనికరవిలీఢవిహాయసంబు లైన మహీరుహంబుల మూలంబుల విహారంబుమూలంబుగా నిజనిశితదంష్ట్రాంకురప్రహారంబు లొనర్చుచు నొండొంటిపై నాహవదోహలంబునం బడు వరాహసందోహంబు లొక్కయెడ నుక్కుమిగులుటయు, వివిధవల్లీకాంతరనిచితమధురమధుకోశమధురససమాస్వాదనలోలంబు లగుభల్లూకజాలంబు లొక్కక్రేవ లావుఁ గాంచుటయు, సమాస్వాదితపరిణతఫలవ్రజంబు లగుజంబూవనంబులఁ దదీయతరుశాఖావలంబితమల్లికామతల్లికల నూని యుయ్యాల లూఁగుప్లవంగసంఘంబు లొక్కయెడ నౌర సౌరుఁ గాంచుటయు, రుషాతిరేకంబున గవయంబులఁ గవియుసింధురములయార్పుసందడులకుం బెదరి పొదరిండ్లకున్ దుముకుకస్తూరిగమికి నాభినిష్యందంబులై యధ్వాంతరంబుల వెలయు కస్తూరికాకర్దమంబుల గజతనూసంజాతదానపంకిలంబుల హెచ్చిల్లఁజేయు గంధసింధురంబు లొక్కెడ నుద్దండత వహించుటయుం గలిగి వివిధవికసితలతాంతనితాంతసౌరభశోభాయమానపవమానమానితంబును, మానితంబినీతనూభవమనోభవభవ్యైకకారణరాజకీరవచస్సంభారసంభాసురంబును, సురాంబురుహలోచనాసమానసౌందర్యసంశోభితభిల్లీమతల్లీగల్లసముల్లసితపత్రభంగరంగద్విశేషపరిమళవాసనావిసరంబును, హసరదసమానలాలితమాలతీలతావితానవేష్టితతరుస్ఫురితమూలంబును, తమాలవనాంతర్జనితనిబిడతమస్సమూహంబునై విరాజిల్లి వాల్మీక్యాశ్రమస్థానసముచితం బగు నొక్క మహారణ్యంబుఁ బ్రవేశించి చనునవసరంబున. 118

చ. తరణికులావతంస మగు తన్మహిజాని కొసంగ సత్క్రియా
పరతను పాద్యమున్ గొనుచు వచ్చె నొకో యనుమాడ్కిఁ దోఁపఁ జె
చ్చెర నికటస్థలాంతసరసీపరిశీతలశీకరంబులన్
సరసము లై పయిన్ విసరెఁ జారుసమీరకుమారవారముల్. 119

సీ. పండి రాలి కపిత్థఫలము లించుక చిట్లి, కమ్మకమ్మని తావిఁ గ్రుమ్మరింపఁ
బరిఫుల్లనూత్నచంపకపుష్పవిసరంబు, వితతసౌరభ్యముల్ వెలికిఁ జిమ్మ

పొలుపారు మొగలిపూవుల క్రొత్తవాసనల్, కాననం బల్లంత కలయఁ బర్వఁ
గమనీయచందనద్రుమసౌరభము లప్డు, హరిదంతపర్యంత మరుగుచుండ
గీ. నంతకంతకు నామోద మతిశయిల్లి, సంతతామోదములు మదిఁ సంతరింప
నృపవరాగ్రణి మున్నుగా నెల్లరకును, బహుమనోహార మై తోఁచె గహనభూమి. 120

ఉ. శాలవనీరుహావళుల కోమలపుష్పపరాగముల్ పయిన్
రాలి దళంబుగాఁగ దనరన్ మరుదాహతి వానిపై విరుల్
తూలిపడన్ మనోజ్ఞగతితో వనలక్ష్మికి నై సుమంబులన్
గ్రాలెడు పట్టుపానుపు లనన్ సరసేతతి పొల్చె నయ్యెడన్. 121

సీ. చెలువారుపల్లవంబుల మెక్కి కడుపారఁ, గోయిలపిండు కో కో యనంగఁ
గోటరంబులనుండి గువ్వపిట్టలకవల్, కువకువనాదసంకులముఁ జూప
నీలకంఠము లెత్తి నెమ్మిపుల్గులగుంపు, కేకి కే కనుచుఁ బల్ కేక లిడఁగఁ
బరిసరస్థితసరోవరపాళిఁ గలహంస, తతులెల్లఁ గలకలధ్వనుల నీన
గీ. వివిధనవపుష్పమంజరీవితతియందు, సమదమధుపాళి ఝుంకృతిస్వనము లీన
వీనులకు విందొనర్ప నవ్విపినవీధి, వివిధకలనిస్వనంబులు విస్తరిల్లె. 122

చ. అనుపమలీల నిట్లెసఁగు నాగహనాంతరమందు సొప్పుఁడై
చనుమనుజేంద్రమౌళి తన శైశవకాలలసద్విశేషముల్
కనులకుఁ గట్టినట్టు లెసఁగన్ సచివాగ్రణిఁ జారుశీలనా
ముని నొకనిం గనుంగొని ప్రమోదరసంబునఁ దేలి యిట్లనున్. 123

చ. ఇట మును వామలూరుజమునీంద్రుని చెంగట శస్త్రవిద్య ను
త్కటగతి నభ్యసించుకొను కాలమునన్ మృగయావినోదలం
పటతను నేను మాలవకుమారుఁడు నీగిరి నొంచినాగ మీ
స్ఫటికశిలామయంబు లగుసానువులన్ వనసత్త్వసంతతిన్. 124

చ. అరుదుగ నీగిరిన్ బ్రభవ మై తగు నీ సెలయేటియొడ్డునన్
బెరిఁగిన యీరసాలవనవీధుల మానిసుతాళితో ఫలా
హరణ మొనర్చి వచ్చి ముదమారఁ జరించితి మీయెడన్ మనో
హరపవమానముల్ మలసియాడఁగ మేన నమాత్యచంద్రమా! 125

మ. అదె యీపర్వత మావనంబు లివె యయ్యజ్ఞాకరం బంబుజా
భ్యుదయోల్లాసి యిదే యటంచు విభుఁ డప్పూర్వానుభూతాటవీ
పదమధ్యస్థితముల్ విశేషములు నప్పట్టుల్ నిరూపించుచున్
మృదుహస్తాంగుళిఁ జేరఁగాఁ జనియె వాల్మీక్యాశ్రమస్థానమున్. 126

సీ. హోమధూమచ్ఛన్న మై మహీరుహకదం, బము తమాలమహీరుహములఁ బోల
వల్కలార్థముగా నపాస్తత్వచంబులై, భుజపత్త్రిశరషండములు చెలంగ
హరిణాననత్రుటితాగ్రభాగంబులై, దర్భకాండముల విస్తరత వఱల
నాశ్రమమార్గపార్శ్వాంచితస్థలులందు, తులసీవనంబులు చెలువు మిగుల
గీ. సన్మునిస్వాంతములఁ బోలి స్వచ్ఛమగుచుఁ, గమలకాసారతతి చెంతఁ గొమరుఁ జూప
ధరణివరమౌళి యాశ్రమస్థానభూమి, మించువేడుకతోఁ బ్రవేశించె నంత. 127

మ. తరుమూలంబుల మన్నతిన్నియలపై దర్భావళీకల్పితా
స్తరణానీకమునన్ వటుప్రవరు లుచ్చైర్నాద మేపార సు
స్వరసంశోభితవేదపాఠపఠనవ్యాసంగమున్ జెందఁగాఁ
బొరసెన్ సమ్మది సమ్మదాధికత లాభూభామినీభర్తకున్. 128

ఉ. ఈగతి నాశ్రమస్థలసమీక్ష నొనర్చుచుఁ దన్మహీవరుం
డేగుతఱిన్ దదాశ్రమమునీంద్రులు కొందఱు తన్ను భూవరున్
గాఁగ నెఱింగి తా మెదురుఁగాఁ జనుదెంచి శుభం బెఱింగి సు
స్వాగతముం బొనర్చి రనివారితభూరితరానుమోదులై. 129

మ. ధరణీనాయకుఁ డిట్లు లాశ్రమజనస్థానంబునన్ సన్మునీ
ద్వారసందర్శితమైనస్వాగతము వేడ్కన్ గొంచు నవ్వార లా
దరలీలన్ దనుఁ దోడ్కొనంగఁ జని సందర్శించె విజ్ఞానసం
భరణోత్సేకి మహత్త్వసాక్షి యగు నవ్వాల్మీకి నుత్కంఠియై. 130

కం. చని యిటు లాధరణీంద్రుం, డనుపమతేజోవిరాజితాధికలీలా
ధనుఁ డగువాల్మీకిమహా, ముని యుటజోపాంతసీమమును జేరంగన్. 131

మ. కవితాకన్యకఁ గన్నవాని మునిరాట్కంజాతమార్తాండుఁ బా
పవనీరాజికృశానుమూర్తిని దపస్స్వాధ్యాయనిష్ఠానిధిన్
భవబంధైకవిదూరుఁ బుణ్యచరితున్ బ్రాచేతసోమౌని న
య్యవనీనాథుఁడు గాంచి మోడ్చె వినతుండై హస్తపంకేజముల్. 132

వ. ఇట్లమ్మహీంద్రుం డమ్మునీంద్రునకు భక్తిం బురస్కరించి నమస్కరించుటయు.

సీ. మునుముందు కవిత యేమునినాథుని నుండి, ప్రవహించఁగఁ గాస్రవతి యయ్యె
భువి రామచరిత మేమునిముఖాంబుజమందు, మకరందబిందుసంపద వహించె
వల్మీక మనుపేర వఱలుశుక్తి కెవండు, జలితంపుముత్యాలపంట యయ్యె
ఘనుచిరం బగుతపశ్చరత యేమునివరు, తనకు నూతనమాతవసము యయ్యె

గీ. నట్టిప్రాచేతసోక్తాని యధిగతైక, వేదవేదాంగవిద్యావివేకవిదిత
సన్నుతశ్లోకుఁ డౌయ్యనఁ దన్నుఁ గాంచి, కన్నుఁగవ మోదబాష్పాంబుకణము లురఁ

సీ. సురరాజతనయభాసురసురూపమువానిఁ, గరిరాజగంభీరగతులవాని
నవలలితాబ్దసుందరతనూరుచివాని, ధవళాబ్జపత్రనేత్రములవానిఁ
గరుణాలసత్కటాక్షప్రసారమువాని, శరణాగతైకరక్షణమువానిఁ
బరిభాసమానకేసరిమధ్యమువాని, దరహాసరుచిరవక్త్రమ్మువాని

గీ. రామచంద్రుని బోలువిభ్రమమువాని, నమ్మహీజానిఁ గన్గొని యనుపమాన
హర్షలీలాతరంగప్రిక్షితాంత, రంగుఁడై యుబ్బె నమ్మునిరాజవరుఁడు. 135

వ. మఱియును, 136

ఉ. పెన్నిధిఁ గన్నయట్టినిఱుపేదతెఱంగున రామణీయకా
పున్నమనాఁటిరేయిఁ బరిపూర్ణశశాంకునిఁ గాంచి యబ్ధిరా
జున్నతిఁ గాంచులీల మహితోదయుఁడై కుశభూమిపాలకున్
గన్నమునీంద్రుఁ డొప్పెఁ బ్రవికాసమనోమహనీయవైఖరిన్. 137

వ. ఇవ్విధంబున నవేలప్రమోదలీలాఖేలనాంతరంగుండై యమ్మునిరాజశేఖరుం డా రాజ
వరేణ్యుం గాంచి చేరం దిగిచి కవుంగిలించుకొని మూర్ధాఘ్రాణంబుఁ జేసి యన్నా!
నన్నున్ మఱవక కాంచవచ్చితివే? లవకుమారుండు కుశలాన్వితుఁడే? నీకున్ సేమమే?
నీవారలకున్ భద్రమే? యని కుశలప్రశ్నంబుఁ గావించి మున్ను తనయొద్ద జానకీ
దేవి కుశలవకుమారులతో నున్నతెఱం గంతరంగంబునం బొడకట్ట సంతోషవిహ్వల
స్వాంతుఁడై కొంతవడి మిన్నకుండి యంతఁ బర్ణశాలకున్ దోడ్కొని చని యుచి
తాసనంబునఁ గూర్చుండ నియమించుటయు నాతఁ డట్లు సేయ మున్ను తనబాల్యం
బునం బరిచితిఁ గలమునివర్గం బెల్లఁ దన్నుం బరివేష్టించి కూర్చుండఁ గుశుండు
వెండియు వామలూరునందనున కిట్లనియె. 138

శా. సేమంబే కద పూజ్యపాదులకు? నీసేమంబునన్ మీతపః
స్తోమంబుల్ కొనసాగుచున్నవె? ఫలశ్రీకంబులై యాశ్రమా
రామంబుల్ విలసిల్లుచున్నవె? మునివ్రాతంబులున్ లెస్సలే?
స్వామీ! మీ రెపుడైన యీమనుమనిన్ స్వాంతంబునం దెత్తురే. 139

శా. మీయాశీర్వచనంబె రక్షగను స్వామీ! రాజ్యమున్ లెస్సగాఁ
జేయంజాలుదు మీదయామతిని సుశ్రేయంబునున్ జెందుదున్
మాయిల్లాండ్రనునుంగువారలకు సేమం బబ్బు మీయాదరా
దాక్షిణ్యంబున్నఁ గొఱంత యేదె మునిచంద్రా! మాకు లోకంబునన్. 140

వ. అని వినయవినమితుఁడై పలికి తనకుశలం బెఱింగించిన నమ్మునినాథుఁ డతనికిఁ గామగమనంబుఁ గల్గున ట్లొకవరంబుఁ బ్రసాదింప నాతఁ డది మహాప్రసాదం బని యందికొని యుండె నట్టిసమయంబున. 141

ఉ. నాకపురంబునన్ దనుజనాథుఁ డొకండు సురేంద్రు సైన్యధా
టీకలితోగ్రుఁడై ప్రతిఘటింప రణాంగణమందు వానితోఁ
దాఁకఁగ లేక యానముచిదానవవైరి సహాయతార్థియై
యాకుశభూవరున్ బిలువ నంపె నొకానొకసైన్యనాయకున్. 142

ఉ. వాఁ డొకరత్నరంజితవిభాతవిభావసుభాసమానమై
వాఁడితళత్తళల్ దొరయుభర్మవినిర్మితమభ్రయానమున్
దోడనకొంచు సంతతమనోజవనంబున వామలూరుజా
తేడిత మహావనంబున మహీస్థలి డిగ్గి కరంబు లొగ్గుచున్. 143

వ. మహేంద్రునకుఁ దనరాక నెఱింగించిన వాల్మీకియుం రాజేంద్రా! యవశ్యంబు రాక్షసవధార్థం బరిగి రమ్ము నీకు జయంబును దానం జేసి యొక్కశుభంబుం గల్గు నని యాశీర్వదించి పంచిన గుశరాజును మహేంద్రప్రేషితం బైనవిమానం బెక్కి యమరావతి కరిగె. 144

ఉ. అంతటఁ బశ్చిమాంబునిధి నంబువిహారము సల్పుతద్దిశా
కాంతకుఁ గుంతలస్థలిని గ్గినకెంపుల నింపుబంతిపూ
బంతి మనోహరైకవిభవం బలరారెడులీలఁ దత్సము
ద్రాంతరమందు జాఱి పడెనా యన భానుఁడు గ్రుంకె నెఱ్ఱనై. 145

ఆశ్వాసాంతము.

శా. కమలావాసనిజాలయాంతరసరద్గారుత్మతోద్యన్మణీ
విమలాంశుస్తుతకుట్టిమాంతరచరద్విఖ్యాతవిద్వజ్జనా!
కమలామోదసుమేరురామరసరిత్కల్లోలమాలాపయ
స్సముదీర్ణప్రవణోపమామలవచస్సందోహసంక్షోభితా! 146

కం. కుందనవీనైందవమణీ, చందనమందారకుసుమసందోహకన
త్సు దరతరకీర్తిఘనా, స్పాందరమాధుర్య! సద్విపజ్ఞవర్యా! 147

స్రగ్విణీవృత్తము. పూర్ణతేజఃప్రభాపోషితవ్యోమణీ!
పూర్ణమాంబాకనత్పుత్రరత్నాగ్రణీ!
కర్ణకల్పద్రుసంకాశవిశ్రాణనా!
వర్ణనీయప్రధావైభవశ్రాణనా! 148

గద్యము.

ఇది శ్రీ వాలఖిల్యపవిత్రగోత్రోద్భవ
వేంకటరత్నాంబికా బాపనార్యతనూభ వాంధ్రగీర్వాణ
భాషాసనాథ ద్విభాషి సోమనాథకవిప్రణీతం
బైనకుముద్వతీపరిణయం
బను మహాప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# శ్రీకుముద్వతీపరిణయము

## ద్వితీయాశ్వాసము.




కారుణ్యకటాక్ష
ప్రాకటరమణీయభవనవైభవయుత, సు
శ్లోకనుత, వైద్యసద్వి
ద్యైకమహోద్దామ! వేంకటేశ్వరనామా! 1

వ. అవధరింపు మాకుశరా జింద్రసహాయుండై యరిగె నది యెట్టు లుండె. 2

చ. జగములలోన నెంతయుఁ బ్రశస్తి వహించి యరిస్వపావళీ
నిగళ మనన్ బరంగి రమణీయరమారమణీనివాసమై
యగణితభోగివీరనికరావితమై యవిపన్న మౌచుఁ బ
న్నగభువనం బెసంగును గనన్మహనీయశుభోపపన్నమై. 3

చ. మహిమమునఁ బుట్టినిల్లు శుభమండలికిన్ నిలయంబు సత్కళా
వహిత నెసంగుతావు సుఖవైభవముల్ విలసిల్లుచోటు నై
మహితవిలాసభాసిసుమమాపరిమండిత మై తనర్చు న
య్యహిభువనంబు నెన్నఁ జతురాస్యుని కైనను జెల్లనేర్చునే! 4

ఉ. భోగివరేణ్యు లాభువనమున్ దమ వాసతలంబుగా మహా
భోగపరాయణైకగతిఁ బూని చరింతురు తజ్జగంబునన్
భోగవతీసరిన్నికటపుష్పవనాంతలతాంతసౌరభా
భోగనికుంజమంజుతరభూముల భూరివిహారశీలురై. 5

వ. అందు భోగవతి యను నొక్క పురంబు విలసిల్లుచుండు నది యెట్టి దనిన. 6

గీ. సత్కవిత్వమతల్లి కాస్థానభూమి, భరతశాస్త్రప్రసిద్ధికిఁ బట్టుఁగొమ్మ
వినుతసంగీతకళకుఁ బెట్టినది పేరు, దీప్తిరుచిరంబు భోగవతీపురంబు. 7

గీ. ఆనగరిలోనఁ గుముదాభిధానుఁ డలరు, భూరితరభవ్యసంపదభ్యుదయశాలి
పరసమున్నతబలనిరాకరణచణవి, రాజితరణకేళి పన్నగరాజమౌళి. 8

చ. సురుచిరసద్యశోవిభవశోభితుఁడై తనరారునట్టియ
య్యురగపతాధినేతకు సహోదరియై భువనత్రయైకసుం
దరి యగుచున్ గుముద్వతి యనంగ నొకానొకకన్య యొప్పు వి
స్ఫురితమనోజ్ఞరూపపరిభూతసురాంబురుహాయతాక్షియై. 9

చ. నెల యుదయింపఁగాఁ గుముదినీలత పొల్పు వహించులీలఁ గో
మలసహకారశాఖ మధుమాససమాగమనంబునన్ విరా
జిలుఁగతి సంజ రాఁగ వికసించువినూతనమల్లిఁ బోలి చె
ల్వలరును దద్వధూటి నవయౌవనభవ్యసముద్గమంబునన్. 10

చ. అలశశికాంతికిన్ వెఱపు నంది కడుంగడుఁ జిమ్మచీఁకటుల్
లలితకళావినిర్జితకళానిధియై తగు నావరాంగిమం
జులవదనంబుఁ దా మఱువుఁ జొచ్చె నొకో యనుమాడ్కిఁ దోఁపఁగా
నలరుఁ దదీయకుంతలము లంచితమేచకకాంతిసంతతిన్. 11

మ. కనకంబున్ సితకైతకంబుఁ గ్రిమమెక్కన్ గంధసౌవర్ణముల్
గనమిన్ రెండును తద్గుణద్వయలసత్కాంతాతనూసామ్యమున్
గన నేకం బయి స్వర్ణకేతకి యనంగన్ బర్వియున్ బోలమిన్
వనరెన్ వాడుచు దీనఁజేసి యొదవెన్ ద్వైవిధ్య మఖ్యాలకున్. 12

ఉ. కందును బొందకున్న నధికంబుగ రాహురదక్షతంబులన్
గందకయున్న హైన్యమును గాంచకయున్న ఘనావరోధమున్
జెందకయున్న వేఁగుటచేఁ గడు వెల్వెలవోకయున్న నా
సుందరిమోముతోడ సరిజూడఁ దగున్ దరుణేందుమండలిన్. 13

కం. కరములు పల్లవసంప, త్కరములు జితపంకరుహనికరములు మృదుతా
కరములు పరిభూతలతో, త్కరములు కలకంఠరుతికిఁ గర మాసతికిన్. 14

ఉ. బంగరుపై మెఱుంగు లిడుఁ బ్రాయఁపుమేనఁ బసిండిగిండులన్
గంగ మునుంగఁజేయు నవకం బగుచన్గవఁ గంజమున్ సమా
సంగతసౌరభంబు ముఖసంపద మోము ముడుంగఁజేయు నా
మంగళగాత్రి పీనకుచ మానితసౌరభశోభితాస్య తాన్. 15

ఉ. పంచమనాదభాసురవిపంచిక మించుగళస్వనంబుచేఁ
చంచలచంచరీకచయచుంచదసూనదృశాంచలంబుచే
వంచల గారవించు నలసాంచితసద్గతిచే రహించు న
కాంచనజిత్వరాంగి కనఁ గాంచినకాంతలు గల్గ రెంచఁగన్.

ఉ. ఆలలనాలలామ తన యైందవరత్నవిశాలసౌధము
శ్రీలలితప్రదేశమునఁ జేటికలన్ బ్రియమారఁ గూడి హే
లాలసమానభాషణములన్ నిగదింపుచు నొక్కనాఁడు ప్రో
ద్దోలిని గొంత వో నడపి యుత్కలికాకలితాంతరంగయై. 17

మ. మహితామోదకరంబు, నవ్యకుసుమసంపన్మానితంబున్, ముహు
ర్ముహురంచత్పికనాదభాసురము నై పొల్పొందుపూఁదోఁటలోఁ
విహరింపన్ మనసై నిశాంతభవనోర్విన్ వీడి తచ్చేటికా
మహిళారత్నము లెల్లఁ జేరి కొలువన్ మందప్రయాతంబులన్. 18

సీ. గమనకంపితములై కంఠహారంబులు, లీల నట్టిట్టు లుయ్యాల లూఁగఁ
జెలువారునుదుటిపై మలయానిలాంకూర, ములకు ముంగురులు సంచలన మందఁ
జెదరినజిల్గుపయ్యెదనుండి కడువింతఁ, బొడుపుగుబ్బ లొకింత పొంచి చూడఁ
గాలియందెలసడుల్ కంకణధ్వనులతో, డను గూడి గయ్యాళితనము సేయఁ
గీ. దనుతరం బగుమధ్యమస్థలము కరము, పోడిమి దలిర్ప జవజవలాడుచుండ
నవతరించినవనలక్ష్మి యనఁగఁ దనరి, యంబుజేక్షణ ప్రమదావనంబుఁ జేరె. 19

ఉ. తిలకములన్ గనుంగొనుచుఁ దేటి, లసన్మధురానులాపముల్
బలుకుచుఁ గర్ణికారతరుపంక్తులప్రాంతలఁ జారుహాసముల్
దొలఁకఁగఁ జేయుచున్ గరిమతోడ నమేరుసముత్కరంబుచెం
తల విహరించి రంత వనితల్ వనలక్ష్మి వికాస మందఁగన్. 20

చ. దళదరవిందనేత్రలు ముదంబున మేలము లాడుకొంచు న
య్యలరులతోఁటలో మధురహాసయుతాననలై చరింప ని
మ్మల నటఁ గ్రొత్తగా విరియఁబూచినమల్లిక లుల్లసిల్లె న
ప్పొలఁతులనవ్వులే చెదరి పువ్వులుగా రహియించెనా యనన్. 21

చ. సుదతి యొకర్తు కేళికయి చూతలతన్ గర మాని నిల్వ నం
దొదవినపుష్పరాజిఁ గని యొగ్మలి యొర్తు మనోజ్ఞశీతరు
గ్వదనరో! నీదుచేతిచలువన్ గదె యీచెలువారుకొమ్మ తా
నదె తనరెన్ నవప్రసవయై యని మేలము లాడె వేడుకన్. 22

శా. లీలన్ దక్షిణజానుమూలమున వీణామాలికావ్యాపృతద్రవా
లోలేందిందిరసుందరస్వనము లాలోఁ గూడి రంజిల్లఁగన్
బాలారత్న మొకర్తు పేర్మిఁ గణము చెంతన్ పొంతగా నిల్చి రా
గాలాపం బొనరించె నంచితకళావ్యాసంగసంగీతయై. 23

చ. చెదరిన పెన్నెరుల్ సరిదిఁ జేత నొకర్తుక ఫాలభాగమం
దిది గని యొర్తు నేర్పున ముఖాబ్జమునన్ గడుఁ బత్త్రిరేఖ తాఁ
జెదరినదే చెలీ! యని హసింపఁ గడున్ స్వకపోలకల్పితం
బిది చెదరంగ లేదె రమణీ! యని రచ్చెలి తోడిభామినుల్, 24

కం. చెలి! మందారాశోకపు, టలరుల నాటఁ గొంటె వన్న నయ్యవె తరువుల్
తెలుపఁగవలెనా లలనా, యలరులకై మాటిమాట కడుగడుగునకున్. 25

వ. అని యిట్టులు తత్సతీవితానంబు లతాంతలతాంతసౌరభనితాంతం బగు నవ్వనాంతంబున సంతోషితాంతరంగలై విహరించుచు, 26

ఉ. దాగుచుఁ గుంజమండలి లతాపరికల్పితడోలికావళిన్
దూఁగుచుఁ బుష్పనిర్గతమనోజ్ఞమరందరసంబు లిమ్ముగన్
ద్రాగుచుఁ బాక్వభాసురలతాయుతసత్ఫలముల్ తెమల్పఁగా
నేగుచుఁ గేళుల న్నెఱపి రంతయు బాల లవేలలీలలన్. 27

గీ. ఇటులఁ గొండొకసేపు పూర్ణేందుముఖులు, వనవిహారంబు సలిపి కుంభద్వినిర్మ
లాంబుకేళుల నెఱప మనోంబుజముల, సంతతోత్సాహవిభవంబు జాదుకొనఁగ. 28

సీ. నీరేజమకరందనిష్యందబిందుసం, చయసమాలోలపుష్పంధయంబు
బిసకాండఖండసంప్రీణితాఖిలరాజ, హంసావతంసలీలావహంబు
లలితనీరజగంధకలితశీతలసమీ, రాంకురప్రసరణాహ్లాదకంబు
నిర్మలనీరంధ్రనీరోద్ధతాభంగ, భంగసంచలనవిభ్రాజితంబు
గీ. భర్మమణిమయసోపానభాసురంబు, శ్రితవినూతనహల్లకశ్రీకరంబు
నగుచుఁ జెలువొందు నొక్క పద్మాకరంబుఁ, బ్రమద ముదయింపఁ జేరిరప్పద్మముఖులు.

చ. మలయసమీరసంగతికి మాటికి సంచలనంబు నొందుచున్
దిలకములట్లు మోములను దిద్దినకుంకుమపంక మంటి య
వ్వెలఁదులకుంతలంబు లరవిందములన్ మకరంద మానుచున్
మెలఁగెడి తేఁటిపిల్లల గణింపఁగఁ జేసె మనోహరంబుగన్. 30

ఉ. మీటినకోర్కిపై నపుడు మీనవిలోకన లెల్లఁ గూడి క
ల్హారనవీనకోరకవిలాసవిశేషవిభాసమానశృం

గారసరోవరాంతరవిగాహనముం బొనరించి రెంతయున్
గైరవబాణపట్టుపరిణద్ధమదద్విరదంబులో యనన్. 31

ఉ. అందెలసందడుల్ చెలఁగి హంసములన్ బెదరింపఁ బద్మినీ
బృందము వాయఁ ద్రోయ మృదువిస్ఫురదంఘ్రియుగంబు లుల్లల
న్మందసమీరవారభవమంజుతరంగములన్ వళిత్రయుల్
దందడిఁ దార్కొనంగఁ బ్రమదాజనముల్ జలకేళిఁ దేలుచున్. 32

సీ. లీల నంబువులపైఁ దేలియాడెడువేళఁ, బద్మినీలతికాళి ప్రాఁకినటుల
గళదఘ్నముగ నిల్చి సలిలంబు లుమియుచోఁ, శశిబింబముల సుధల్ జాఱునటుల
మునిఁగి నిర్మలజలంబులనుండి లేచుచోఁ, గగనంబునను మించు లెగయునటులఁ
గ్రొమ్ముడుల్ వడి వీడఁ గ్రుంకు వాటించుచోఁ, భృంగసంఘము చిమ్మ రేఁగునటుల
గీ. నగణితానందవిభవంబు మిగులుకొనఁగ, జలవిహారంబు లీరీతి సంతరించి
మందమందతరాయాసమహిమ లెసఁగఁ, జంద్రవదనలు కాంతినిస్తంద్ర లగుచు. 33

ఉ. మట్టెలు చప్పుడుల్ గొలుప మాటికిఁ దాఁకుచుఁ బట్టుభంగముల్
కట్టడి సేయఁగా గతివిలాసముఁ గొంత జలార్ద్రవాసముల్
బిట్టుదొరఁగి కేశజలబిందువు లంబుదముక్తముక్తలన్
దిట్టఁగఁ జేయ లోన నెలనాఁగలు సేరిరి తీరభూమికిన్.

వ. ఇటులు దరి కరుదెంచి యయ్యోషలు యథోచితవేష లగుటయుం, వారివిహార
సం బగునయింప నొక్కయెడ విశ్రమింపం దలంచి;

చ. లలితపుమాలతీలతికలన్ రచియించిన కాయమానపుం
జెలువముచే నెసంగి హరినీలపురాయొడికంబుకంబముల్
గల యొకచంద్రకాంతమణికల్పితవేదికపై సఖీతతిన్
గలిసి కుముద్వతీసతి వికాసము మోమునఁ జెంగలింపఁగన్. 36

మ. తనయుల్లాసననుంగుఁజేడియలలోఁ దాత్పర్యలీలావచో
జనయత్కౌతుక యౌ నొకానొకశరచ్చంద్రాననం గూడి
తనమందారసుమాంతరోదితమరందద్రవ్యమాధుర్యమున్
గను నెయ్యంపుటనుంగుఁబల్కులను వక్కాణించు కాలంబునన్. 37

మ. తనకున్ నెచ్చెలియై, ప్రియంబు గలదై, తారుణ్యసుశ్రీకరై,
ఘనవిద్యాన్వితకామసంచరణ సత్కౌశల్య యౌ పన్నగాం
గన యొక్కర్తు వసంతవల్లరి యనంగా నభ్రమ్మునుండి చెం
తను యంతన్ డిగెఁ జంద్రరేఖ భువిపైనన్ డిగ్గు చందంబునన్. 38

గీ. దిగి యిటులు గంధబంధురదివ్యకుసుమ, విసగను కుముద్వతికిఁ బ్రియం బెసక మెసక
నొసఁగి కూర్చుండునంత నయ్యుత్పలాక్షి, వాని గొని యిట్లువల్కెఁ జెల్వంబుదొల్క

శా. కేళీవేల్లితపంకజంబు వెలయున్ గేలన్ సలీలంబుగాఁ
బూలన్ గూర్చినసెజ్జ మైనునిచి యప్పూఁబోఁడి యచ్చేడెతో
"నాళీకాక్షి! వసంతవల్లరి! మరున్మర్త్యాదిలోకంబులన్
బాళిం గాంచినవింత లేమికలవో వానిన్ వినం బల్కవే". 40

గీ. అనుటయు వసంతవల్లరి యయ్యుహించి, కన్యకకుఁ బల్కె మాధురీకలితలలిత
సరసవాక్యప్రచారసంసక్తి నెనసి, మోముఁదమ్మిని జిఱునవ్వు మొలకలెత్త. 41

మ. కలికీ! నేఁ డమరావతీపురిఁ గనన్ గౌతూహలం బంది. యా
లలితాకాశతరంగిణీఝరులఁ జెల్వంబౌ కలారావముల్
దోలఁకన్ బాలతరంగడోలికలలోఁ దూఁగాడు రాయంచపి
లలతీవిన్ గనుఁగొంచు నేగి యలనల్లన్ వ్యోమమార్గంబునన్. 42

సీ. సురసతుల్ నీరాడఁ గరఁగు మైఁబూఁతలన్, జాలైన యయ్యేటిచాయ గనుచుఁ
దులలేనిపూవుతావుల నీని మైఁబుల్క, లమరించుతటవనాంతములఁ గనుచు
నమలమాణిక్యదీప్తాతపంబులఁ గాసి, కొమరొందు దివ్యసౌధములఁ గనుచుఁ
జలువయాలయరంగు లలరారునగరి శృంగారంపుశృంగాటకములఁ గనుచుఁ
గీ. గలితహరినీలమణిపతాకముల దిశలఁ, దళుకులొలికించు వైజయంతమును గనుచుఁ
గ్రమముగా దేవనగరచిత్రములఁ గాంచి, యంత నరిగితి నందనోద్యానమునకు. 43

కం. చని యట నొకవాపీతట, మున మందారద్రుమంబుపొంత గుబురుగాఁ
గను నల్లికొన్న సుమనో, వనమాలిక లలరు పొదలపజ్జఁ దిరుగుచున్. 44

ఉ. ఆయమరేంద్రునిన్ గలిసి యందుల సుందరకల్పకద్రుమ
చ్ఛాయవిహారముల్ సలుపు చక్కని యొక్కని మర్త్యధారుణీ
నాయకపాళిఁ గంటిఁ గుశనామకునిన్ గమనీయరూపరే
ఖాయుతసంపదన్ మరునికన్నను జెన్నగువాని మానినీ! 45

సీ. అతనియాననచంద్రు నధికానురక్తయై, వీక్షింప నేచకోరాక్షి కగునొ
అతనిబాహాశాఖి కావలంబన మంది, తనియంగ నేలతాతన్వి కగునొ
అతనిపాదాబ్జసేవాసక్తి ననురక్తి, వెలయింప నేయాలివేణి కగునొ
అతనివక్షోవీధియందు హారివిహార, కలన కేకలహంసగమన కగునొ
గీ. ఆమె పో యదృష్టభాగ్యంబు లనఁగవలయు, నామనోహరరూపంబు నావిలాసు
మాపెడంగులు నాసొంపు నరసిచూడఁ, గన్ను లున్నవె యవ్వానిఁ గనుఁగొనంగ.

చ. చికిలి మెఱుంగు చూపులను జిందెడి యందముఁ జూడ హాసచం
ద్రికలను జిమ్ము నెమ్మొగము తిన్నదనంబుఁ గనుంగొనంగ మే
చకజలజాతజాతరుచిసంపద నింపు కనుల్ గనంగఁ జం
పకసమగంధి! యొచ్చె మను మాట యొసంగునె వాని రూపునన్. 47

ఉ. కంటికిఁ దోఁచినన్ హృదయకంజము జిల్లనఁ బల్లవింప మైఁ
గంటకితం బొనర్చు తను కాంతి, యొకింత కరాంబుజంబుచే
నంటినఁ గందునట్టి మృదు వౌతను వబ్బురపాటుఁ జూప వా
ల్గంటి! తదీయరూపమును గంటిఁ బ్రమోదము వెంట నంటఁగన్. 48

గీ. కుందనంబున నీలంబుఁ గూర్చినటులు, హారవల్లిక నాయకం బతికినటులు
చిల్కముక్కున బింబంబుఁ జేర్చినటులు, నిను నతఁడు పొంద నదె కాదె జననఫలము.

వ. అని యిటులు పల్కు చెలి కాకల్కి యిట్లనియె. 50

మ. మును నేఁ జెప్పఁగ వింటి భోగివనితల్, భూలోకదేవేశ్వరుం
డనువిఖ్యాతి గడించి రాముతనయుండై శౌర్యరేఖాకళా
ధనుఁ డా నాకుశరాజచంద్రు నిపు డో తన్వంగి! నీ వన్నయా
మనుజేంద్రుం డతఁడో పరుండో వివరింపన్ గౌతుకం బయ్యెడిన్. 51

మ. లలనా! యయ్యమరావతీపురికి నేలా రాఁగ నా భూవిభుం
డల దేవేంద్రున కాహవంబునకు సాహాయ్యంబుగా వచ్చుటల్
జలజాప్తాన్వయ మౌ మహీపతుల కాచారంబు లౌఁ గాన నం
దుల కేతెంచెనొ కాక యన్యమున కానో తెల్పవే నాపుడున్. 52

చ. చిఱునగ వంకురింప, ముఖసీమ పయిన్ మధురానులాపచా
తురి నెఱవొందునట్లుగ, మృదుస్ఫురితంబుగ, నవ్వసంతవ
ల్లరి యను నెల్లెఱింగినటులన్ వచియించితి వమ్మ, చెల్లరే!
తరుణి! కుశాగ్రబుద్ధివి గదా యని హాయని వేడ్క వెండియున్. 53

గీ. రాముతనయుండు కుశరాజు రణమునందు, సమరభర్తకుఁ దోడయి యసుర నోకనిఁ
జెండె నని యాతనిన్ గూర్చి చెప్పికొనఁగ, దేవతాభామినులచేతఁ దెలిసికొంటి.

కం. నరనాథుఁ డేమి యాని, జ్జరనాథున కాజియందు సాహాయ్యముగా
నరుదెంచు నేమి! యంతటి, సురుచిరవిక్రముఁడొ యనుచుఁ జోద్యము దోఁపన్. 55

గీ. విక్రమం బన దేవేంద్రవినుత మనుచుఁ, జక్కఁదన మన స్మరసముజ్జ్వల మటంచుఁ
గీర్తి యన నిర్ఝరీబృందగీతి యనుచు, నుత్కలిక నెమ్మనంబున నుద్భవిల్లి. 56

గీ. వానిరూపంబు నీకుఁ జూపఁగఁ దలంచి, చిత్రఫలకంబునను వ్రాసి చిత్రగతిని
దెచ్చితిని జూడు మిదెయంచుమచ్చెకంటి, యొక్క ఫలకం బొసఁగ విస్మయోదయము,

క. మొనసినటు లతనిఁ జిత్రి, మ్మునవ్రాయఁగ నతనిరూపమును వర్ణింపన్
మునుకొనెడుకౌతుకంబున, మును కని విని యెఱుఁగ నట్టిముచ్చట దోఁపన్. 58

వ. తత్ఫలకంబుఁ గనుంగొని తనలోని కౌతుకరాగాంకురంబులఁ జెలుల కెఱిఁగింపక గుప్తంబు సేసి కొంతవడి విహరించి యనంతరంబున సౌధాంతరంబున కరిగె. 59

ఆశ్వాసాంతము

శా. క్షీరాంభోధితరంగసంగతపయశ్శ్రీరామణీయప్రభా
హారిప్రస్ఫుటసద్గుణోచ్చయ! నయవ్యాసంగసంగీభవ
త్కారుణ్యాశ్రయ! లోకపావనకనద్ధన్వంతరిప్రస్తుతో
దారశ్రీకరపాదపంకజమిళిందప్రాయభావోదయా! 60

కం. సంతతవిద్యాగోష్ఠీ, సంతానితసమ్మదప్రసార! భవానీ
కాంతామణికాంతకన, త్కాంతకృపాపూరపూరితస్థిరవిభవా! 61

మాలినీవృత్తము. సరళహృదయసారా! సాధుసత్యప్రచారా!
శరధిసమగభీరా! సద్యశశ్శ్రీవిహారా!
ధరణిసురవరేణ్యా! దానవిద్యాశరణ్యా!
భరితసుగుణగణ్యా! బంధురాత్యంతపుణ్యా! 62

గద్యము:

ఇది శ్రీవాలఖిల్యపవిత్రగోత్రోద్భవ వేంకటరత్నాంబికా
బాపనార్యతనూభ వాంధ్రగీర్వాణభాషాసనాథ
ద్విభాషి సోమనాథకవి ప్రణీతం బైన
కుముద్వతీపరిణయం బను
మహాప్రబంధంబున
ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# శ్రీకుముద్వతీపరిణయము

## తృతీయాశ్వాసము.



వేంకటేశ్వరస్థిర
సేవాహేవాకనిచితసిద్ధచికిత్సా
ప్రావీణ్య! వేంకటేశ్వర!
దైవతహితకార్యకరణధర్మాచరణా! 1

వ. అవధరింపు మివ్విధంబునఁ దత్ఫలకనిరీక్షణసంజాతమన్మథవిక్రియాసంరూషితాంత
రంగయై యున్నయప్పుడు. 2

చ. మఱఁ డనుహాలికుండు నలమానవతీమణిచారుమానసాం
తర మనుక్షేత్రసీమమునఁ దద్విభురూపనిరీక్షణం బనన్
బరఁగినతొల్కరిన్ విరహభాగనురాగమిషంబునన్ సువి
స్తరగతిఁబొల్చుబీజములఁ జల్లె రయంబున నంకురింపఁగన్. 3

కం. మదనాగగమన యిటు ల, మ్మదనాగతవిశిఖశిఖల మానము ధృతియున్
సదమద మై చనఁగ దురా, సదమదవివశాంగి యగుచు స్వాంతమునందున్. 4

చ. తనుఁ గనినట్టు లాతఁడు పదంపడి కౌఁగిటఁ జేర్చినట్టు లి
మ్మున గిలిగింత యైనటుఁ గపోలమునం దనమోవిఁ దార్చి మో
మును దమి ముద్దుఁగొన్నటు విమోహితయై హృదయాంతరంబులోఁ
ననుకొని సంతసిల్లు విరహార్తి మెయిన్ వెతఁ జెందు నంతనే. 5

వ. ఇట్లాబిసరుహాలోచనామణి కళవళంపడమానస యై యున్నయవసరంబున. 6

గీ. తోఁపువన్నియ మోదుగతోఁపులందు, నెగడె సరిక్రొత్తమొగడలు చిగురుగములు
పాంథతతి నేచ మదనసంబంధి యగుచుఁ, గణకణ రగుల్కొనెడునగ్నికణములట్టుల.

ఉ. పాండురపత్రముల్ తరులపంక్తులనుండి డొలంగి ధారుణీ
మండలిపై నెసంగె నలమాధవుజన్మదినోత్సవంబు ను
ద్దండత సల్పఁ దత్తరుపితానము లెల్ల వనప్రియాళికిన్
రం డని పిల్వఁబంచిన కనచ్ఛుభపత్రసముత్కరం బనన్. 8

చ. వనకమలావసంతులవివాహ మొనర్పఁగ మున్న పెండ్లిపూఁ
తు నొవరఁ జేసి దైవతవధూతతి యవ్వనలక్ష్మికిన్ బ్రియం
బునఁ దలఁ జల్లినట్టిపాలుపుం గనుముత్తెఁపుఁబూససేసలో
యనఁగఁ దగెన్ రసాలవిటపాగ్రములన్ సుమనఃపరంపరల్. 9

సీ. కలకంఠసంతానములకు సిద్ధాన్నంబు, చిలుకగుంపులపాలి ఫలితనియతి
తొలుకారుపంటకాఁపులపున్నెములపంట, లతకూనలకు మంచిఋతుసమయము
కళ్యాణములకుఁ జక్కనిక్రొత్తతరుణంబు, విరహులచిత్తంబు వెచ్చవాటు
వనరమాసతికి మైమెనెడుపచ్చనిచేల, మవనీజశోభాంకురార్పణంబు
గీ. మలయపవనుండు మెలమెల్ల మలయువేళ, యళిసమూహంబు బువ్వంబు లందుకాల
మఖిలసుఖసంపదలు పొల్చునట్టిక్రంత, సముదితం బయ్యె వాసంతసమయ మంత.

మ. వికసత్పాటలముల్ పథాంతరము లావిర్భూతవాతాంకుర
ప్రకరంబుల్ ప్రమదావనాంతములు నిర్యత్పుష్పసౌరభ్యసూ
చకముల్ చారులతావితానములు గుంజన్మత్తభృంగీకదం
బకముల్ భూజము లై తగన్ దివసముల్ భాసిల్లె వాసంతముల్. 11

గీ. కంతునామంత్రణము సేయుగతి దలిర్పఁ, గోయనిలతాగ్రములనుండి కూయఁదొడఁగెఁ
బంచమస్వరవిస్ఫూర్తిభరిత కాకు, కాకలీధ్వని వాసంతకోకిలములు. 12

చ. అలరె వసంతకాల మిటు లందనిమ్రాఁకులపండ్లరీతి గా
నలర విలాసిసంతతికి నంగసముద్భవకేళివేళలన్
బాలయలుకల్ వహించుపువుఁబోఁడులచారుకుచోపగూహముల్
లలితము లై యయాచితఫలంబులుగన్ సమకూరఁ జేయుచున్. 13

వ. వసంతసమయంబు సకలజనమనోభిరామం బై మలయమారుతసంచారసంచాలిత మానినీమనఃపల్లవంబును మంజుతరకుసుమమంజరీపుంజసంజాతపరాగపరికలుషిత మధువ్రతీహృదయదర్పణంబును నిఖిలమండనమండితకేళికావాసవాసకసజ్జికానికరంబును స్మరప్రవర్ధమానమనోహరయామినీసమయంబును నభిసారికామనోనుకూలంబు నై యుదయించినంత. 14

కం. అనుదినమును గ్రమమున, జం, దనగంధిదశల్ మనోజదశలకుఁ బాల
య్యెను నిశల నిద్రవారయమి, ననిశము దివసములు తోఁచె ననిశంబులుగన్. 15

గీ. వీఁక మైపూఁత లిడ ననంగీకరణము, లీలఁ జందన మలఁద నిర్లిప్తతయును
ముకురము న్గూడ మిగుల వైముఖ్యవృత్తిఁ, గ్రమతఁ బాటించె నెశేఁద నాకంబుకంఠి.

సీ. విగతనిద్రాసక్తిఁ దగుకన్గొనలకెంపు, శ్రవణకల్హారపత్రములఁ బోల
సంతాపభవఘర్మజలకణంబులచాలు, చలువక్రొమ్ముత్తెంపుసరుల నెనయ
రమణీయపులకాంకురప్రసారంబులు, మకరికాపత్రసంపద వహింప
విప్రయోగవ్యథావిశదగండయుగంబు, సుమరజోలేపవిస్ఫూర్తిఁ గనఁగ
గీ. చంద్రముఖి వీతదేహసంస్కార యయ్యు, విరహసంభవపరితాపవివిధనవ్య
భవ్యశృంగారరసకళాభంగు లెల్ల, సొగసు వెలయించి మండనశోభ గూర్చె. 17

కం. ఈవిధమున గురుతరవిర, హావిర్భావంబు వెలయ నాత్మాంబుజముం
దావెలఁది యొక్కనాఁడు ని, శావల్లభమణివిశాలసౌధమునందున్. 18

సీ. సగము వైచినయట్టిజడపెన్నెరులసొంపు, జఘనస్థలము దాఁటి సందడింప
వ్యత్యస్తము లగుదువ్వలువకుచ్చెళులు శ, య్యాతలంబును గొంత యలమి పొరల
విగతబంధం బౌచుఁ దగుకంచుకమునుండి, కులుకుగుబ్బలబెడంగులు చెలంగఁ
బాణ్యంగదము లూడిపడి ప్రకోష్ఠంబుపై, చెలువారి కంకణశ్రీ వహింప
గీ. దైన్యభావంబు మోముపైఁ దారసిల్ల, నొక్కకరమున శిర మూని యొత్తిగిల్లి
యమలపర్యంకభాగంబునందుఁ బండి, యంత నొయ్యన డిగ్గి శయ్యాతలంబు. 19

చ. జలరుహరాగపాత్రికల జాలెడుచారుతుషారవారిధా
రలు గలయంత్రపుంబరిసరంబుల శీకరముల్ పయిం బడన్
జెలు వగుకుడ్యభాగములచెంతల నొయ్యనఁ జేరి యయ్యెడన్
నిలువక వంత నంత నవనీరజబాణవివర్ణచిత్తయై. 20

సీ. పనియున్న చుట్టుల ముందున కేగి యొకకొంత, యాలోచనము సేసి యచట నిలుచు
నిలిచి యచ్చటునుండి మలఁగి క్రమ్మఱ వచ్చు, వచ్చి నెయ్యంపుఁజెల్వలను బిలుచుఁ
బిలిచి యక్కాంతలు చెలి! యేమిపని యన్నఁ, బ్రత్యుత్తరంబుఁ జెప్పకయ యుడుగు
నుడిగి యిట్టులు కొంతవడి యాలసించి తా, మే మంటి రని వారి నెదిరి యడుగు
గీ. నడిగి యే మమ్మ! యిటు వరధ్యాన మనుచుఁ, దను బరిహసించువారిపై గినుకఁ బూను
ధరణిపతిపైనఁ జిత్తంబుఁ దవిలి విరహ, భరపరీతపరీతాపభరిత యగుచు. 21

మ. అలరుంబోఁడి యిటుల్ మనోభవశరవ్యాకీర్ణచిత్తంబుతో
నలరుందీఁగల సొంపుఁ దీఁగల విచిత్రలేఖనాకల్పనల్
చలువంపుం జెలువంపు పెంపులు గహించన్ మించులన్ మించుక్రొ
న్నెఁజా వెన్నెలరాణ గాంచు నొకతిన్నెం జేరి యాసీనయై. 22

చ. అవిరళనీలరోచిరుచిరంబును జెంద్రాడికుంతలమ్ము లా
శ్రితకనకపోలయుగ్మముగ జాఱఁగ వాల్గడ కొంత వీడి వెన్
దవిలి నటింపఁ బేశలసుధామధురాధరకాంతి యారుపుం
భావమునం గగ్గువారఁగఁ గపోలమునన్ జెయిఁ జేర్చి యుండఁగన్. 23

గీ. తనదుచెలు లంతలోన నత్తన్వియున్న, రత్నమందిరమునఁ బంజరమునఁ దనరు
కీరశారికలకును జక్కెరలు వెట్టి, నేగుదెంచి యటన్ గల్గునింతిఁ గాంచి. 24

గీ. వాడియును నొకింత చెలువంబు వదలనట్టి, మోముఁదమ్మియు, బడలియుఁ గోమలతను
విడనితనులతయును వింతబెడఁగుఁ జూప, నత్తరుణిజాడ లెల్ల వా రరసి యరసి. 25

వ. కించిదంకురితమధురస్మితభూషితానన లై యయ్యోషామణు లన్యోన్యవదనంబుల
నీక్షించుకొనుచు. 26

ఉ. మొన్న వనంబులోనఁ బువుఁబోఁడి కుళక్షితినాథువృత్తమున్
విన్నది మున్నగాఁగ నళివేణి! నితాంతవియోగవేదనా
ఖిన్నతఁ గాంచి యుండెఁ బరికించితివే? మణిమంజరీ! యదే
యన్నులమిన్న! యౌఁగదె మదాలస! యంచును వారు వారిలోన్. 27

కం. గుజగుజలు వోవువారై, గజగాము లెల్ల నేత్రకరసంజ్ఞల నీ
రజపాణితలఁపునం గల, నిజమున్ వివరించుకొంచు నెయ్యం బలరన్. 28

గీ. చేరి యక్కన్యకామణిచెంత నిలిచి, విలసితానూనసమ్మదాన్వీత లగుచుఁ
దన్మనోగతభావ మత్తరుణివలన, వినఁదలఁచి మందమధురోక్తు లనువు నొంద. 29

చ. చెలి! యిటు నీదునెమ్మొగము చిన్నదనంబు వహింపనేల మం
జుల మగునీదృశావళి విశుద్ధతఁ బాసి కలంగ నేల కో
మలి! యణుమాత్రమైనను గ్లమంబును నైఁపదు గోగుపూవుతీ
రు లలిత మైననీమెయి సరోజముఖీ! యిటు లుండ నేటికిన్. 30

గీ. అనుచు నడిగెడుతతి సరోజాయతాక్షు, లందుఁ గొందఱు నర్మగర్భాంచితముగ
సరసతను బ్రోదిసేయుహాస్యప్రసంగ, వశత నయ్యెడ నక్కుముద్వతిని గాంచి. 31

ఉ. మాయమగారి కేమొ మణిమాల! మనమ్ము మనమ్మునందు లే
దే యని యొక్కటేమ; సుదతీమణి! యింతటిలోనఁ గాదఁటే
యీయమతీరు మాటె నిది యేమొకొ చిత్రము గాఁగఁ దోఁచె నం
చాయతనేత్ర యోర్తు; తగునా? యిటు లాడఁగ నం చొకర్తయున్. 32

వ. పలుతెఱంగుల దన్నుం బరిహసించునపుడు. 33

కం. వారలఁ గని తనమానస, వారిజమున నింతరోషవర్తన మెసఁగన్
వారిజముఖి కయ్యెడ దయి, వారెడుతమిఁ గని వసంతవల్లరి యంతన్. 34

గీ. ఇంతి! నీహృదయంబున నెద్దియైన, దాచి యెఱుఁగవు మా కొకింతయును గాన
నాత్మ నీ విట్లు ఖిన్నత నందియున్న, కారణం బేమి చెపుమ శంకను దొఱంగి. 35

కం సొగటా లాడఁగఁ బిలువవు, సొగసుంగీరములఁ బల్కుసొంపులు కఱపిం
పఁగఁ దె మ్మన వలఱులఁ గో, యఁగ ర మ్మన వేమిహేతు వంబుజనయనా! 36

చం. అని యిటు లావిలాసవతి యాయలినీలవినీలకుంతలన్
గని మృదుభాషలన్ బలుకఁగా మనమం దనువొందునట్టిసి
గ్గును ఘనసంభ్రమంబు నొకకొంతవడిన్ వెనుకాడఁ జేయఁగాఁ
దనహృదయంబునం గలవిధం బెఱిఁగింపఁగ నెట్టకేలకున్. 37

ఉ. అంకురితంబులై హృదయమందునఁ గోరకితంబులై మనో
జ్ఞాంకితభూతిఁ బుష్పితము లౌచుఁ జిగిర్చినరాగవల్లికల్
సంకెళులై మనోధృతి కశక్తత వే ఘటియింప లజ్జకై
యంకిలి సెప్పి లోనఁ దరళాయతలోచన సంభ్రమించుచున్. 38

గీ పలుకఁగాఁ జూచు నంతనే పలికినంత, నే మగునొ యంచు మది సంశయించి మాను
మానఁజాలక వెతఁ జెందు మనమునందుఁ, దొడరి లజ్జయు మోహంబుఁ ద్రొక్కులాడ.

వ. ఇవ్విధంబున నందంద డెందంబు వందఁ గందర్పబాణనిహతిన్ బొందు సెడినతాలి
మిన్ దూలి, మనోనురాగసూచకం బగుచందంబు బొందువడ మొగంబున రాగంబు
నెగడొందఁ బాలపల్లవసహాకరం బగుకరంబున దంతిదంతసమకాంతికాంతంబు లగు
కపోలాంతరంబులన్ బొడముస్వేదవారిలవంబులఁ జేలాంచలంబునన్ దుడుచుచు
సురతరంగిణీకనకకమలకల్హారహారిమకరందబిందుసందోహమాధురీధురీణంబు లగుమృదు
భాషణంబుల నయ్యోషామణిం గాంచి. 40

శా. ఓరాజానన! దాఁచ నేఁటి కిఁక నాయుల్లంబునన్ గల్గుభా
వారంభంబులఁ దెల్పెదన్ వినుము వన్యాంతస్థలిన్ మున్ను నా
భూరాజన్యుని పేరు విన్నదియమున్ బుష్పాస్త్రు తీవ్రాంబకా
సారవ్రాతముపాలఁబడ్డయది నాస్వాంతంబు సొంతంబుగన్. 41

కం. పువ్వుఁబోఁడి! యిఁక నే, నెవ్వేళమునైన నా క్షితీశ్వరమణికే
జవ్వనము నమ్ముకొంటిని, బువ్విలుతు నమ్ముకొంటి మోహనలీలన్. 42

ఉ. ఏగతి నామహీరమణు నేఁ బతిఁగా గ్రహియింతు నాతఁ డీ
భోగవతిం గనుంగొనఁగ ముద్దియ ! యెట్టులువచ్చు వచ్చినన్
నాగవరేంద్రకన్యకను నన్నుఁ బరిగ్రహణం బొనర్పఁగా
లోఁ గరుణించి యమ్మదను లోఁగొనఁజేయు టదెట్లు నా కిఁకన్.

చ. అనుచు వికంపితాధరయు సంచితగద్గదికానులాపయున్
వినమితవక్త్రపంకరుహవిభ్రమరమ్యయు నై పొరింబొరిన్
మనమున నాపలేనియసమానవీనమనోజవేదనా
జనితనితాంతశోకభరసంగతిఁ గన్నుల నీరు నింపుచున్. 44

వ. లజ్జావనతవదనయై మిన్నకుండునంత, నబ్బాలికన్ దగ్గఱి యాశ్రువులన్ దుడిచి యుపలాలించి మెల్లన వసంతవల్లరి యిట్లనియె. 45

మ. జలజాతానన ! నీమనం బెఱుఁగ నాస్వాంతంబునం దెంచి కా
కలభూమీవలయాధినాయకుని నే నస్మత్కళానైపుణిన్
నిలువంబెట్టనె నీదుచెంత నపుడే నీ వింతమాత్రంబునన్
దలఁకం బాడియె నెమ్మదిం బొరసి కాంతా కంతుసంతాపమున్. 46

గీ. ఎవ్విధంబున నైన నయ్యినకులేంద్రు, రామతనయాగ్రణిని గుశరాజుఁ దెత్తు
మానసంబున నీ వణుమాత్రమైన, మాను మనుమాన మణుమానమధ్య ! యింక. 47

వ. అదియునుం గాక. 48

ఉ. పూఁచినకొమ్మవంటిపొలుపుం గను నీయెలజవ్వనంపుమైఁ
జూచినయంత నే వలపుఁజొక్కున మోహము నవ్విభుం డెవన్
దాఁచగలండటమ్మ యలదర్పకుఁ డుద్ధతి వానితాలిమిన్
దోఁచికొనండటమ్మ మదిఁ దొట్రుపడన్ జనునమ్మ కోమలీ ! 49

ఉ. కావున నింతవంతఁ గనఁగావల దమ్మ మనంబునందు ల
జ్జావతి ! యంచు నాస్యజలజంబునఁ గూరినకుంతలంబులన్
జే వడలించి తీర్చుచు వనిన్ విహరింతము రమ్మ సమ్మదం
బై విలసిల్ల నేఁడు చెలు లందఱుఁ గూడ నటంచు మెల్లనన్. 50

గీ. కేలఁ గొని యక్కుముద్వతికేలి నావ, సంతవల్లరి వేశంతె కొంతదిటపి
కలితఖాసంతపాసంతి కామనోళి, రామ మారామవసుమతీసీమఁ జేరె. 51

సీ. వకుళద్రుశాఖ లొండొకటితో నొకచోటఁ, బెనఁగొన్న గుబురుతోఁ బొనరు వెన్క
మల్లెతీఁగలతోడ మలపినవిరజాజి, విరిపందిరికి సరాసరి నెసంగి
గెలలు వైచినయట్టి లలితరంభాసంభృ, తశ్రేణికలకు మధ్యస్థలమునఁ
గిసలయాంకితకోరకితబాలసహకార, తరుశాఖికల కెక్కి వఱలు నక్క
గీ. కుసుమవల్లీచయంబుల నెసక మెసఁగు, మంజుతరకుంజరమ్యసీమంబునందు
నుండి యొకకొంతతడవు నం దుండ నింక, నిచ్చగింపమి నాపూవుటిల్లు వెడలి. 52
గీ. వాసితామోదసుమలతాభాసమాన, కాయమానాంతరంతఃప్రలీయమాన
సరసపవమానవనతరుచ్ఛాయమందు, సంచరించుచుఁ గుసుమదాసుజాత యంత. 53
కం. నిలు పోపక నొకదెస ను, జ్జ్వలదార్తిని దద్వనాంతసంగతసరసీ
నళినీచలదళినీకుల, కలనాదావళికి నులికి కలికి కరంబున్. 54
సీ. ఒకచూతతరుజాతవికచాతినవమంజు, తరమంజరిన్ గోయ నరిగి వెఱచి
ఒకపూఁజవిక చేరి వికచేడితసుమాంచి, తపరాగపరభాగతకుఁ గలంగి
ఒకప్రాఁకునకుఁ బ్రాఁకు నొకయాకుపెలదీవి, యకుఁ జేరి మది నంత యడలి మగిడి
ఒకసల్లలితపల్లవకదంబనికురుంబ, కలితాంబురుహవాటిఁ గని తలంకి
ఆ.వె. ఒకవినీలనీలశకలావళీకేళి, భూధరాగ్రకటకభూధరాజ
వనవిభాసమానవలమానపవమాన, పటలి నుఱుకుఁ జెంది పద్మనయన. 55
గీ ఆవనంబున నిల్వ నత్యంత మైన ఘనవిషాదంబు వొడమ నక్కాంత చెంతఁ
గలుగునాళీజనంబులఁ గాంచి వేడి, యూరుపుల మోవిచిగురుటాకు కుమ్మగిల్ల. 56
ఉ. ఈవని కేలవచ్చితిమొ యిందునిభానన యీపరాగజా
తావిల మైనమార్గములయందుఁ జరించుటకంటె సౌధమం
దే వసియింపఁ గొంత సుఖియింపఁగ నొప్పుదుఁ గాక యీయెడల్
కేవల మార్తిమాత్రమునకే యగుఁ గాక సుఖంబుఁ గూడునే? 57
కం. అని యిటుఁ బల్కుటయును న, వ్వనితామణు లావిలాసవతి నొయ్యనఁ దో
డ్కొని మందమందగతులన్, జని సౌధముఁ జేరి రట్టిసమయమునందున్. 58
సీ. రేకెత్తె మదిఁ జకోరికలకోరిక లెల్లఁ, గమలినీనివహంబు కన్నుమూసె
జక్రవాకద్వంద్వసంతాపములు హెచ్చె, జారకాంతలతాల్మి జాఱఁదొడఁగెఁ
బుచుఁబోండ్ల కనురక్తి మొనసి మొగ్గదొడంగ, శీతాంశురత్నముల్ చెమటఁ దోఁగె
గ్రెంకారముల ఖగశ్రేణి మింటఁ జరించె, నోషధీనివహ మభ్యుదయ మందె
గీ. బంధుజీవకరుచిఁ బద్మబాంధవుండు, భువనములకొక్కమాటు దోఁబూచిఁ జేసె
వహ్ని దేవుండు దీప్తిమత్త్వము వహించె, సంజ యుదయించి భువనాళి జాదుకొనఁగ,

సీ. విరహిణీజనమనోవిరహాంధకారంబు, వెడలి యెల్లెడ వెల్లివిరిసె ననఁగ
గగనాంగణంబుపైఁ గలయంగ నలికిన, కలితకస్తూరిపంకం బనంగ
రవిబింబ మనునగ్నిరాశి యారఁగఁ దోనఁ, బొడమి క్రమ్మినయట్టిపొగ యనంగ
నాకాశనదిని నీరాడి రాత్రివధూటి, విదిరించుఘనకేశవితతి యనఁగ
గీ. సురతరాజాండ మన నొప్పుబరణియందు, నినిచి యుంచినయభినవాంజన మనంగ
నీలనీలద్యుతిప్రరోహాళి వెలయ, నంధకారంబు లెల్లెడ నావరించె. 60

గీ. అభ్రహరినీలమణిశాణమందు సాన, దీరరతనం బనంగను దేజరిల్లి
చంద్రుఁ డలర వికర్షణజనితరేణు, సంతతి యనంగ నక్షత్రసమితి దనరె. 61

సీ. క్షీరపాథోరాశికీర్యమాణతరంగ, నివహంబుపై గల్గునిగ్గుఁ జెఱచి
యసమానవైశద్యలసమానమై పొల్చు, శేషాహిమైచాయచెలువుఁ దెగడి
కమనీయఘనసారఖండమండితవిభా, విసరంబుపైఁ గల్గుపస హరించి
విమలహీరపటీరవిస్ఫురన్నవకాంతి, పూరంబునన్ గల్గుపొల్పుఁ దెల్పి
గీ. అమృతభాండంబు తోఁబుక్కఁ జిం దాడినట్టి, రామణీయకవరసుధారస మనంగఁ
బిండి యారఁగఁ బోసినవిధము దోఁపఁ, బొలిచెఁ జంద్రాతపము పుచ్చపువ్వువోలె.

వ. ఇవ్విధంబునన్ బొల్చుచంద్రాతపంబున నాతపనీయగాత్రి యొకవిశాలచంద్రశాలాంతరంబునఁ గాంతశిలామయపరిమండితం బైనయొక్కవేదికపైఁ జెల్వొందుచెంగల్వవిరుల విరచించినమృదులపర్యంకభాగంబున నధిగతవిప్రయోగయై యధివసించి. 63

మ. మనుజాధీశ్వరు లోఁ దలంచుఁ గడుఁబ్రేమ న్నించి మన్నించు నా
తని వర్ణించుచు నెవ్వ రేమి యనినన్, దా నెద్దియో చింతలో
మునుఁగంబోవునటుల్ నటించు మది నేమో యున్నయ ట్లెంచుఁ బూఁ
దోనల న్నించి మరుండు పొంచి శరముల్ తోడ్తోఁ బచారింపఁగన్. 64

కం. ఈకరణి కుసుమబాణశి, ఖాకిరణవిషణ్ణ యగునుఁ గళవళపడుచో
నాకన్నియఁ గని చెల్వలు, వీఁక న్నియతానురాగవిస్ఫూర్తి వెలయన్. 65

సీ. అపుడె విచ్చినపూల నలరుపుప్పొడిఁ దెచ్చి, సరిక్రొత్తముత్తెంపుసరులఁ దెచ్చి
నవనవలాఘుపల్లవవితానముఁ దెచ్చి, యసలార గప్రంపుపసలుఁ దెచ్చి
పస మించి చెమరించుపచ్చికస్తురిఁ దెచ్చి, స్వచ్ఛమౌ నీహారవారిఁ దెచ్చి
వడలిపోవనియట్టివనజాతములఁ దెచ్చి, పస నౌశీరంపుఁబటలి దెచ్చి
గీ. చంద్రికాజాలవైశద్యసాంద్రమైన, చందనపుమేలిమసటిరసంబుఁ దెచ్చి
కలువపూవులలోనిరేకులను దెచ్చి, చంద్రవదనలు శైత్యోపచారవిధిగ. 66

మ. పరికల్పించిరి నాగరాజతనయాపద్మోదయాద్వంద్వముం
దరవిందాస్యలు కొంద ఱందు నవనీహారాంబుసంభావిత
ద్ధురఘ్నానసవీననూనపటలీధూళీమిళచ్చందనా
గరుకర్పూరమృగీమదస్వరసపంకన్యాప్తి వర్తింపఁగన్. 67

మ. సరసోశీరరసంబు మైఁ జల్లదవే సౌదామినీ! తమ్మిపూ
విర వొందింతము పీవనల్లఁ గొని తేవే మాలతీ! కాంజికు
ళ్ళ్యాటపుంబుప్పొడిఁ గప్పి క్రొవ్వియలచే నొప్పారఁగా సెజ్జగాఁ
బరికల్పింపవె రాజహంసి! యనుచున్ బంకేజపత్రేక్షణల్. 68

కం. పరిచారము లిడుతఱిఁ దదు, పరి చాలన్ బోఁడముతాపభరమునఁ గడునా
తరళాబ్జపత్రనేత్రికిఁ, దఱలంగా నంతకంత తాలిమి మఱచెన్. 69

ఉ. సారపుఁజల్వలం జిలుకుచంద్రికళాకమనీయకాంతిచే
నోరమొగంబు వెట్టఁగఁ బయోజముఖిన్ గని కాంత లెల్లఁ బ
న్నీరము మున్నుఁగాఁగ నివి నెమ్మదికిన్ బరితాప మార్పఁగా
నేరక మానినీమణికి నిమ్మరు వోసిన నీళు లయ్యెడున్. 70

కం. అలరాజు వినినమాత్రనె, నెలరా నెలజావిధంబు నెఱపుచు గరఁగన్
దలిరాకుఁబోఁడి నెమ్మది, వలరాజుబలం బదెంత వలమో తలఁపన్. 71

ఉ. ఎంతటిలోన మాఱెఁ దరళేక్షణచిత్తవికాసవైఖరుల్
వింతగదమ్మ నెమ్మదికిఁ గ్లేశ మనంగ నెఱుంగనట్టియి
క్కాంతకు నెంతఁజేసెఁ గొఱగానిమరుండు శిరీషపేశల
స్వాంత నెలంత యెక్కడ యవారితమారుతాప మెక్కడో. 72

గీ. ఇనకులాన్వయమణియమ్మహీధవుండు, కడఁకఁ గనుఁగొని విరహాబ్ధిఁ గడపుదనుక
శైశిరక్రియలకు నింకఁ జక్కఁబడదు, మనసరోజాతపత్రలోచనమనంబు. 73

గీ. హారిసుమదామ మనియెడుపేరదేల, సరసచందన మనియెడుచర్చ యేల
వలపుఁగపురంబు లనియెడుపలుకు లేల, అరయ విరిబోఁడి కీసౌరభాంగి కింక. 74

వ. అని యాహేలావతు లాలీలావతిన్ బలుకుచు సోపాలంభవచనంబుల రతీంద్రచం
ద్రుల నుపలక్షించి. 75

చ. సిరికి జనించి తీవు సరసీరుహనాభునియంకసీమపైఁ
గర మరుదారి యావిశదకంజరుహాసనుతమ్ముఁడట్టి వై
వరనుతి కెక్కి యీపగిది వంశమునన్ గమిఁ జెంది యెట్లుగాఁ
దరుణుల నేచు నల్పమగుధర్మము బట్టితి వయ్య మన్మథా! 76

మ. తలిరుఁబోఁడుల నేఁచునట్టియసురే తాఁకంగఁ జంద్రా! నినున్
నెలకున్ వాశముఁ జెందుచున్ గ్రమతప్పై నీరేక బాగుంతుచేఁ
బొలుపొందన్ జనియించుచున్ మగుడ నాపూఁబోఁడులన్ గిన్కతోఁ
గలఁచ న్మాన విఁకన్ గ్రహింప వగుచున్ గాఁటింతుఁగా కెమ్మెయిన్. 77

కం. కలశాంబుధిగర్భమునన్, గలశాతౌర్వంబె నీవుగాఁ బుట్టి యిటుల్
నెల వైతివి క్రూరతకున్, నెల వైతివి, తివిరి మానినీతతి నేచన్. 78

గీ. కుముదహిత! తామసీశ్వరత్వమును గనియు, మఱి కుశేశయవిద్వేషకరుఁడ వయ్యుఁ
గువలయానందకరకీర్తిఁ గొంటి వార, యిదియె నీసౌమ్యవర్తనం బెంచి చూడ. 79

గీ. అని వచించుచు నాచిగురాకుఁబోఁడు, లెల్ల నుపలాలనము సేసి యిందుముఖిని
యూఱడించుచు నచ్చోటు నుండునంత, నుదితఘనలీల మఱునాఁటియుదయవేళ. 80

వ. అవ్వసంతవల్లరి విషాదాకులితచిత్తయై యున్నకుముద్వతిం గాంచి నీమనఃప్రి
యం బీడేర్తు నమ్మహీవరు నిటకున్ దోడ్తెత్తుఁ జిత్తంబునఁ దత్తఱిల్లకు మని యామె
నోడంబఱిచి కుశసమాహరణసన్నద్ధయై యయోధ్య నరయ నరిగె నట్టిసమయంబున.

ఉ. ఆయమరావతీపురమునందు విశేషము లెల్లఁ గాంచి ర
మ్యాయితకీర్తి యాకుశనరాధిపుఁ డాత్మపురంబు సేరు దం
చా యమరేంద్రుఁ బల్కుటయు నాతఁ డమందతరానుమోదసం
ధాయకసౌహృదం బెసఁగఁ దన్మహినాథుమనఃప్రియంబుగన్. 82

చ. అనిమిషవాహినిన్ బొడమినట్టియనర్ఘ్యమణిగణంబు నం
దగవనవీధి నూత్నముగ దైవతవృక్షచయంబు బూసంగఁ దె
చ్చినసుమనోమనోహరవిచిత్రితరాంబరరాజి నిచ్చి "లో
మన దగుచెల్మి నేమఱకుమా మనుజాధిప!" యంచుఁ బల్కుచున్. 83

శా. నిర్యన్నూతనరత్నకందళరుచిన్ జెల్గొంది సుశ్రీకతా
ధుర్యం బైనొకయభ్రయానమును నూతున్ వేగ రావించి రా
డ్వర్యున్ దోడ్కొని యెక్కి దానిపయి, వేడ్కల్ మీఱ మందాకినీ
పర్యంతంబును వీడుకొల్పి సుమనః పాలుం డటన్ గ్రమ్మఱున్. 84

చ. అదియు ననన్యవేగవిజితానిలమై నెఱిమించుమించులన్
విదిపి నభోంతరాళపదవీతల మెల్ల వెలుంగఁ జేయుచున్
గదిసి యయోధ్య దత్పురజనంబులు కంధరపంక్తి నెత్తి స
మ్మదఘనసంభ్రమాకలితమానసులై వెఱఁగంది చూడఁగన్. 85

ఆ. వె. తోఁకచుక్క సరవిఁ దోఁచి క్రిందికి దిగి, పడెడురీతి నభ్రపథమునను రు
చిప్రజంబు పైకిఁ జిమ్ముచు నొయ్యన, నవని కవతరించు నవసరమున. 86

మ. కలయావర్తిత మై మణిప్రభలచే భాస్వత్సరోజాప్తమం
డలి కల్లన్ గుడిఁ గట్టుచున్ దిరిగె మింటన్ దద్విమానం బన
ర్ఘలసత్కాంచనపద్మరాగకలికా రారజ్యదుద్యత్కరా
వళిచే హేళిని గుండలించుక్రియఁ దద్వ్యర్థక్రియాకాంతులై. 87

కం. తిరిగి కోటాలున సయ్యం, బరయానము డిగియె రాజభవనముపొంతన్
బురజనులు చుట్టుముట్టుచు, విరివిడి యగు దాని చెలువు వీక్షింపంగన్. 88

వ. ఇట్లువ్విమానం బవతరించినంత నరపాలుండును విమానావతరణంబు సేసి నిజసన్నిహితబంధుమండను లగు నిర్వురు రాజకుమారప్రవరులు దండనుండి కైదండ నొసంగ వేదండంబుఁ బెండువడం జేయు గంభీరసింహగమనంబుల నంతిపురంబు సొత్తెంచి యొక్కెడ నుచితాసనంబున నున్నయపుడు. 89

కం. తనయాప్తజనులు కొందఱు, తనజయమున్ గోరి యడుగు తత్ప్రశ్నచయం
బున కుచితభంగిఁ దనతోఁ, జనుదెంచినయను చరుండు సమ్మదలీలన్. 90

చ. మనమను జేంద్రవాళి కసమానగతిన్ జయలక్ష్మి ముందుగాఁ
గను జనుదెంచి పొందుటయె కాని పరాజయ మెన్నఁ డుండునే
యనుచుఁ దదీయ మైనవిజయం బెఱిఁగించుచు వారి వారి నె
మ్మనముల సమ్మదోరుగరిమన్ వెలయింపఁగఁ జేసె నంతలోన్. 91

కం. నరనాథాగ్రణి యంతః, పురి నిష్టపుగోష్ఠిఁ బ్రొద్దుఁ బుచ్చి యినుండున్
జరమాద్రి కేగ సంధ్యా, చరణీయార్ఘ్యాదివిధులు సల్పి యతనికిన్. 92

గీ. తాను కృతభోజనుఁ డయి యధ్వశ్రమంబు, నపనయింపఁగ నొకవివిక్తాసమాన
రామణీయకనిజమందిరప్రదేశ, మందు నొంటిగ వసియించె నట్టివేళ. 93

కం. అంతన్ గుముద్వతీఫణి, కాంతామణిచేటి శీఘ్రగతి నృపనగరా
క్రాంతం బగుభూభాగం, బంతయుఁ గని యయ్యయోధ్య నరయుచుఁ జరవిన్. 94

వ. ఎట్టకేలకు నవ్వసంతవల్లరి యయోధ్య కరుదెంచె నప్పటి కయ్యది నిశాసమయం బగుటయుఁ బురద్వారంబు సమీపించి యెదురఁ గనుంగొనునపుడు. 95

ఉ. గోపురతఃకిరత్కనకగోపుర మై కమనీయలక్ష్మికిన్
గాఁపుర మై వినిందదలకాపుర మై ఘనసౌఖ్యలీలకున్
దాపర మై విచిత్రతకుఁ దాఁ బర మైకనిధాన మై మహీ
నూపుర మై వెలుంగఁగఁ గనుంగొని యాపుర మాపురంధ్రి తాన్. 96

కం. మనమున నివ్వెఱపడి రహి, బెనఁగొన నీనగరికిన్ గుబేరపురం బ
య్యనిమిషనాథపురంబున్, జను నే సరిపోల్ప సకలసంపద్గరిమన్. 97

ఉ. చూచితిఁ గాని రమ్యగుణశోభితలౌ నగరీమతల్లులన్
జూచి యెఱుంగ నిట్టిసుమనోజ్ఞతఁ గన్నపురీవరంబు వా
హా! చతురాస్యచిత్రరచనాభినిరూఢత యంచు మెచ్చి లో
నా చపలేక్షణామణియు నందులఁ జొచ్చి తిరోహితాత్మయై. 98

వ. నగరికాశృంగారశృంగాటకంబుల బెడంగు నంగీకరించుచు రమణీరమణీయసంగీతసం స్ఫూర్తిరంగంబు లగునత్తుంగహర్మ్యంబుల దృష్టిని నంగీకరించుచు నగణ్యపణ్యాంచిత పణ్యవీథీచయంబులకు హర్షించుచు గమనవేగంబుఁ బరికర్షించుచుఁ గ్రమంబుగా రాజమందిరంబు సమీపించి యతీతకక్ష్యాంతరయై నిరస్తపరిచారికాజనం బగుటం జేసి శుద్ధాంతరంగంబునుం బోనిశుద్ధాంతగృహంబుఁ బ్రవేశించి. 99

సీ. మించుటద్దముల బింబించువిద్యుద్దీప, వితతికై యొకకొంత విస్మయంబు
మరుజవోచ్ఛలితవిద్యుత్తాలవృంతాని, లములకై కొంతయాహ్లాదగరిమ
వలభీనిబద్ధమంజులరత్నపుత్రికా, వ్రాతంబునకుఁ గొంతకౌతుకంబు
లీలాభిలిఖితకుడ్యాలేఖ్యసత్కళా, కలనకై కొంతయుత్పులకభావ
గీ. మెనసి చని చని ముందట ననుపమాన, మానితానూననవచంద్రమణిశిలావి
శాలశాలాసలీలానులాలనీయ, మందిరాళిందపాండుభూమములఁ గడచి. 100

ఉ. అచ్చపుఁబాలఱాపలక లాని రచించినచప్పరంబులన్
బచ్చలఁ గెంపులన్ రుచులు పర్వ కనుల్ మిఱుమిట్లుఁ గొల్పఁ దా
నెచ్చటినుండి యెయ్యెడకు నేగుటయో యెఱుఁగంగలేక లో
నచ్చెరు వందుచు న్నిలిచి యల్లన నవ్వలి కేగి ముంగిటన్. 101

సీ. యమునాస్రవంతి చయ్యన నెత్తివచ్చెనా, హరినీలరుచిసముత్కరము బర్వ
హరినీలరుచులతో నలమి చల్లఁగ మేన, గృహమహీరుహగంధవహులు వీవ
గంధవాహములతోఁ గలిసి కేళీకూళి, తుహినాంబుకణసంతతులు చలింపఁ
దుహినాంబుకణములందులఁ బుష్పరజ మంటి, సముదీర్ణనవసౌరభముల నీన
గీ. నిన్నియుం గూడ మేనిపై నెనయఁజేసి, శాద్వలాంతర్మహీవీప్రసరణి కవలి
కెలన వనమాలికాలతాకీర్ణ మైన, నరవరేశ్వరుకేళిమందిరము దరిసి. 102

వ. తదనంతరంబునం గలమహీనాథపర్యంకభాగంబు వీక్షించి సమీపంబున కరిగ ననంతరంబున. 103

ఆశ్వాసాంతము.

శా. పాటీరద్రుమసౌరభాయితగుణవ్రాతాతిదీవ్యద్దిశా!
వాటీసంచయభోగభాగ్యమహిమప్రాచుర్య! మేధానదు

గాత్రిటోప స్తవనీయ ! శాంతియుతధైర్యస్థైర్యవజ్రోల్లస
త్పేటీభూతహృదంతరాళ ! ఘనసంవేదక్రమానర్గళా ! 104

కం. సారస్వతరమ్యవచ, స్సారస్యసుధారసప్రసార ! లసద్ధీ
సారసమంచితబుధహృ, త్సారసహంసాయమానసత్కార్యనిధీ ! 105

భుజంగప్రయాతము. అనేకార్చనాప్రీణి తాబ్జాక్షదేవా !
పునీతాన్వయోద్భూతభూరిప్రభావా !
వినీతిప్రరంగద్వివేకప్రధానా !
మనీషాప్రకర్షాసమంచన్నిధానా ! 106

గద్యము.

ఇది శ్రీవాలఖిల్యపవిత్రగోత్రోద్భవ వేంకటరత్నాంబికా
బాపనార్యతనూభవ వాంధ్రగీర్వాణభాషానాథ
ద్విభాషి సోమనాథకవిప్రణీతం బైన
కుముద్వతీపరిణయం బను
మహాప్రబంధంబునం
దృతీయాశ్వాసము.

ఉ. చూచితిఁ గాని రమ్యగుణశోభితలౌ నగరీమతల్లులన్
జూచి యెఱుంగ నిట్టిసుమనోజ్ఞతఁ గన్న పురీవరంబు నా
హా! చతురాస్యచిత్రరచనాభినిరూఢత యంచు మెచ్చి లో
నా చపలేక్షణామణియు నందులఁ జొచ్చి తిరోహితాత్మయై. 98

వ. నగరికాశృంగారశృంగాటకంబులబెడంగు నంగీకరించుచు రమణీరమణీయసంగీతసర స్వతీసంగంబు లగునత్తుంగహర్మ్యంబుల దృష్టిని నంగీకరించుచు నగణ్యపణ్యాంచిత పణ్యవీథీచయంబులను హర్షించుచు గమనవేగంబుఁ బ్రకర్షించుచుఁ గ్రమంబుగా రాజమందిరంబు సమీపించి యతీతకక్ష్యాంతర యై నిరస్తపరిచారికాజనం బగుటం జేసి శుద్ధాంతరంగంబునుం బోని శుద్ధాంతగృహంబుఁ బ్రవేశించి. 99

సీ. మించుటద్దముల బింబించువిద్యుద్దీప, వితతికై యొకకొంత విస్మయంబు
నురుజవోచ్చలితవిద్యుత్తాలవృంతాని, లములకై కొంతయాహ్లాదగరిమ
వలభీనిబద్ధమంజులరత్నపుత్రికా, వ్రాతంబునకుఁ గొంతకౌతుకంబు
లీలాభిలిఖితకుడ్యాలేఖ్యసత్కళా, కలనకై కొంతయుత్పులకభావ
గీ. మెనసి చని చని ముందట ననుపమాన, మానితానూననవచంద్రమశ్శిలావి
శాలశాలాసలీలానులాలనీయ, మందిరాళిందపాండుభూములఁ గడచి. 100

ఉ. అచ్చపుఁబాలఱాపలక లాని రచించినచప్పరంబులన్
బచ్చలఁ గెంపులన్ రుచులు పర్వ కనుల్ మిఱుమిట్లుఁ గొల్పఁ దా
నెచ్చటినుండి యెయ్యెడకు నేగుటయో యెఱుఁగంగలేక లో
నచ్చెరు వందుచు న్నిలిచి యల్లన నవ్వలి కేగి ముంగిటన్. 101

సీ. యమునాసరిద్వంతి చయ్యన నెత్తివచ్చెనా, హరినీలరుచిసముత్కరము పర్వ
హరినీలరుచులతో నలమి చల్లఁగ మేన, గృహమహీరుహగంధవహులు వీవ
గంధవాహములతోఁ గలిసి కేళాకూళి, తుహినాంబుకణసంతతులు చలింపఁ
దుహినాంబుకణములందులఁ బుష్పరజ మంటి, సముదీర్ణనవసౌరభముల నీన
గీ. నిన్నియుం గూడ మేనిపై నెనయఁ జేసి, శాద్వలాంతర్మహీవీ ప్రసరణి కవలి
కెలన వనమాలికాలతాకీర్ణమైన, నరవరేశ్వరుకేళిమందిరము దరిసి. 102

వ. తదంతరంబునం గలమహీనాథపర్యంకభాగంబు వీక్షించి సమీపంబున కరిగె ననంతరంబున. 103

ఆశ్వాసాంతము.

శా. పాటీరద్రుమసౌరభాయితగుణవ్రాతాతిదిక్సద్ధిశా!
వాటీసంచయభోగభాగ్యమహిమప్రాచుర్య! మేధానదు

గాత్రోప స్తవనీయ ! శాంతియుతధైర్యస్థైర్యవజ్రోల్లస
త్పేటీభూతహృదంతరాళ ! ఘనసంవేదక్రమానర్గళా ! 104
కం. సారస్వతగమ్యవచ, స్సారస్యసుధారసప్రసార ! లసద్ధీ
సారసమంచితబుధహృ, త్సారసహంసాయమానసత్కార్యనిధీ ! 105
భుజంగప్రయాతము. అనేకార్చనాప్రీణి తాబ్జాక్షదేవా !
పునీతాన్వయోద్భూతభూరిప్రభావా !
వినీతిప్రరంగద్వివేకప్రధానా !
మనీషాప్రకర్షాసమంచన్నిధానా ! 106

గద్యము.

ఇది శ్రీవాలఖిల్యపవిత్రగోత్రోద్భవ వేంకటరత్నాంబికా
బాపనార్యతనూభ వాంధ్రగీర్వాణభాషాసనాథ
ద్విభాషి సోమనాథకవిప్రణీతం బైన
కుముద్వతీపరిణయం బను
మహాప్రబంధంబునఁ
దృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీకుముద్వతీపరిణయము

## చతుర్థాశ్వాసము.



వర్ణితవిద్యాసం
భావనపరిపోషణైకభావన ! నిజసం
సేవకజనచాతకలో
కావనఘన ! వేంకటేశ్వరాఖ్యాకఘనా !

వ. ఆకర్ణింపు మివ్విధంబునం దల్పంబు దరిసి.

గీ. పాలమున్నీటిపై లీలఁ బవ్వళించు, పద్మనాభుని చెలువంపువరుస నెనసి
రాణ మీఱఁగ నిదురించు రాజవరుని, గాంచి రయమున భుజగేంద్రకన్యదూతి. 3

మ. వగమాయాపటిమంబుఁ జేసి కొనిపోవన్ జూచి, రాజేంద్రుఁ డ
త్కరరమ్యాంగుళి నొక్కముద్రిక మహాత్వప్రాంచితంబై రఘూ
ద్వరసంప్రాపిత మై వెలుంగుచును దత్కార్యంబె యక్కాంతకున్
దరమున్ గానిది యయ్యె మాయలు మహాత్మశ్రేణులన్ డాయునే. 4

కం. ఏయనువు నంద నేరక, చేయునదియు లేక ఫణికులేశయముఖి య
త్యాయతదైన్యముఁ గని విభ, లాయితనిజమానసావిలత్వము వెలయన్. 5

చ. మగిడి యనంతరంబు నృపమందిరసుందరసీమ వీడి త
న్నగరి నతిక్రమించి జవనంబున భూభువనంబు వీడి ప
న్నగజగతీతలంబునఁ గనత్కమనీయమణీగణాంక మై
యగణితలీల వొల్చుకుముదానుజహర్మ్యముఁ జేరి యయ్యెడన్. 6

మ. తనసాకేతపురీవినిర్గమనవృత్తాంతంబు సాంతంబుగా
వినఁగన్ బల్కె కుముద్వతీసతికి నుర్వీపాలచూడామణిన్
వనజాతాప్తకులప్రదీపకుఁ గుశున్ నాగకుమారమండలం
బునకున్ దేఁ దగియున్నయట్టిసమయంబున్ జూచు మన్నంతకున్. 7

కం. తదనంతరంబ యచ్చో, నుదితశ్వశ్రూఘుసప్రసూనోదారరమా
స్పదుఁడై కుశభూజానియు, సదమలసుఖలీల నుండె సాకేతమునన్. 8

వ. ఆసమయంబున.

మ. వెలసెన్ గ్రీష్మసమాగమంబు సకలోర్వీమండలవ్యాప్తితో
జ్వలనార్యాతపతాపతాపితదివోభాగంబు నబ్జేక్షణా
వళిసంచాలితతాళవృంతరచితస్వప్రాణనాథోపచా
రలసన్మంజురతిప్రసంగసమయప్రస్ఫారరాత్రంబు నై. 10

కం. పడమటిగాడ్పులు విసరన్, దొడఁగెన్ దరుపర్ణసంతతులు చూర్ణములై
పడఁదొడఁగ ధారుణీస్థలి, వెడవెడ వైశ్వానరుండు వేఁడిమి హెచ్చెన్. 11

వ. ఇటులు సకలజనసంతానసంతాపకరం బై గ్రీష్మకాలం బరుదెంచుటయు జననిశ్వాస
పవనంబుఁ దక్క పవనసంచారంబు లేక యాకు లల్లాడక భూభాగం బగ్నిప్రతప్తం
బగుమంగలంబు తెఱంగున నతిమాత్రదుస్సహం బై యున్నయవసరంబున. 12

చ. అవనిపు డొక్కనాఁటియుదయంబున మంత్రిజనాళితో సుహృ
న్నివహముతోడ బాంధవమణీగణసంవృతుఁ డౌచు నేగి య
త్యవిరళభంగసంగపవనావళు లౌసరయూసుశీతలాం
బువుల విహారముల్ సలుప మోదముఁ జెంది నిజాంతరంబునన్. 13

మ. తనభృత్యప్రకరంబులన్ వడిగ ముక్తారత్నసందీప్తనూ
తనశృంగారములన్ రథంబులను రథ్యశ్రేణికిన్ జేసి యుం
చ నియోగింపఁగ వార లట్లు సలుపన్ దానున్ నిజాప్తుల్ సుహృ
జ్జనముల్ మంత్రులు వేఱు వేఱు రథరాజశ్రేణి నాసీనులై. 14

కం. సరయూనది కభిముఖులై, సరయోద్ధతి నరిగి రథికసత్వసమంచ
త్కరితురగభటసముత్కర, పరివృతు లై రాజు నతనిపరివారంబున్. 15

చ. అరుదుగఁ దత్ప్రయాణసమయంబున భేరులమ్రోఁత మించఁగాఁ
దరలి వివాహదీక్షకయి తాఁ జను పెండ్లికుమారునట్లుగా
నరిగెడుచో నృపాలకున కగ్రమునన్ గుడినుండి యడ్డుగాఁ
గరలుచు నొక్కపాల యరిగెన్ బవనంబులు వీచె హాయిగన్ 16

ఉ. వానిని గాంచి యాధరణిపాలునియాప్తజనుం డొకం డనున్
మానవనాథ! మంచిశకునం బిటు చావమె యేగుదెంచినన్
దీనికి సిద్ధియౌ శుభవిధిన్ వచియింతు రటన్న మందహా
సాననుఁ డౌచు నేగ మనుజాధిపుఁ డాసరయూస్రవంతికిన్ 17

చ. చని వడి నాస్రవంతికి రసాతలనాథుఁడు తన్నికుంజవా
టిని విపులంబు లౌపటకుటీరములన్ విరచింపఁ జేసి యం

దనుపమవాక్కళాచతుర వరాహితసంతతితో విహార మిం
పొనర నొనర్చుచుండె సరయూసరదూర్మిరటత్తటంబులన్. 18

కం. విహరించి కొంతసే పటు, మహిపాలుఁడు నతనిమిత్రమండలి చెంతన్
విహితాంబుజాతసౌరభ, మహితం బగు నానదిన్ గ్రమంబునఁ జేరన్. 19

సీ. పద్మసౌరభముచే వాసించువిమలాంబు, తతులచేఁ బొదపద్మములఁ గడిగి
అంబుపూరమునుండి యావిర్భవించిన, మేలితెమ్మెరల నెమ్మేన విసరి
కల్హారమాలికాగణసంగతంబు లౌ, నకరుఁబుష్పాదులఁ గానుకలఁ బంచి
స్ఫుటితంబులై మించు పుండరీకంబులఁ, బొలుపొంద నెమ్మేనఁ బూజఁ జేసి
గీ. తానమాడంగ వచ్చిన ధరణినాథు, విలసితార్ఘ్యాదిసత్కారవిధులచేత
సమ్మదాంకురభావంబు సంతరించి, మించి యానది పూజఁ గావించుకొనియె. 20

వ. ఇవ్విధంబున నన్నదిం బ్రవేశించి జలక్రీడాభిగతుం డై యారాజశేఖరుండు తాన
మాచరించుచు. 21

శా. ఉత్తానుం డయి కొంతసేపు నదిపై నుత్క్షిప్తసర్వాంగభా
గోత్తీర్ణుం డయి కొంతసేపు నిజబాహుద్వంద్వవిక్షేపణో
దాత్తుం డై యొకకొంతసేపు సలిలాంతర్గామి యై నిష్క్రియా
యత్తత్వంబునఁ గొంతసేపు పరిఖేలాలోలచిత్తంబునన్. 22

కం. విహరించుమహీవరునకు, మహితశ్రీరామదత్తమంజులరత్న
స్పృహణీయ మంగుళీయక, మహీనజవమునను నీరమందున జారెన్. 23

చ. అది గనకే మహీరమణుఁ డుదులఁ గొండొకసేపు కేళి స
మ్మద మొదవంగ సల్పఁగఁ గ్రమంబున సంతతఖేలనక్రమం
బుదితము గాఁగ నిర్మలజలోద్ధితుఁ డై తటభూమిదేశమున్
మృదులపదక్రమం బెసఁగ మెల్లనఁ జేరి నిజాంగుళిస్థలిన్. 24

మ. తనముద్రాభరణంబుఁ గన్గొనక రత్నవ్యస్తమూర్ధంబుతోఁ
గననౌ భోగి యనన్ స్వహస్తము వినిష్క్రాంతప్రభాజాల మై
కనుపట్టన్ మది నుద్భవిల్లిన సమగ్రం బౌనిపాదంబుతో
జననాథుండు ప్రధానులన్ బిలిచి యాజ్ఞాబంధనోత్సేకియై. 25

ఉ. నీరములోనియుంగరము నేర్పునఁ దీయఁగఁ జాలుసత్కళా
పారగు లైనజాలరుల వైళమ రాఁ బిలిపింపుఁ డన్న న
వ్వారును సంభ్రమాధికజవంబుల భృత్యులఁ బంచి తన్నదీ
తీరనివాసు లై మనెడుధీవరులన్ బిలిపింప వారలున్. 26

సీ. నెతి మీఁద నొదల నీలిపాగలఁ జుట్టి, జానువుల్ డిగ్గ గచ్చడలఁ బెట్టి
వలనూలు తాళితో వలకేల నమరించి, డాకేల గడపుతెడ్లను ధరించి
వలతోకచాలు మూపుల మొత్తముగఁ జేర్చి, కటి మీలబుట్టలఁ గదియఁగూర్చి
గాలముల్ పగ్గంపుగమిఁ గుచేణుల నించి గూడల వెనువెంటఁ గూర్చి యుంచి,
గీ. మత్స్యగర్భచ్యుతంబు లౌమంచిముత్యములను బగడాల సంకుపూసలను మునుఁగఁ
గానుకల నుంచి రాజశేఖరునియెదుట, దండములఁ బెట్టి నిలిచి రాదాసజనులు.

చ. నిలిచిన వారిఁ గాంచి ధరణీవరనందనుఁ డాత్మముద్రికన్
జలములనుండి తీయఁగను సత్వర మానతి నీయ వారలున్
వలలను గొంచు పోతములపైఁ జని యాసరయూతరంగిణీ
కలితరసప్రపూర మవగాహ మొనర్పఁగఁ జూచునంతలోన్. 28

చ. మును నృపుఁ డేఁగడంగినకుముద్వతిచేటి వసంతవల్లరీ
ఘనఘనవేణి యత్తటిని గన్గొని తత్తటినీజలంబులన్
దనరెడునుంగరంబుఁ గొని దా నహివల్లభరాజధానికిన్
జని వడి నక్కుముద్వతి కొసంగెఁ గుశాగమనాభికాంతుచేన్. 29

వ. ఇవ్విధంబున నెబ్భంగి నైన దానిని విడువనోపక భూపాలుం డిటకు వచ్చు ననుతలం
పున నట్లానర్చుటయు నిక్కడ జాలరులు జాలముల వైచియు గాలముల దించియు
నీరంబున మునింగియు జలాంతర్భాగ మంతయుం గలగుండు గావించి వెదకి వెదకి
వేసారి యెందును గానవారై వెలి కరుదెంచి నరపాలుం గాంచి. 30

ఉ. సామి! శోపాఁదు మీ రిపు డొసంగినయానతిఁ జేసి యేటిలో
భూమికి నెల్లవారలము మున్గి వలల్ పడవైచి యెందు నెం
దేమియొసంగువాని నొకయింతయు వీడక దేవి చూచి క
న్గో మెటనైన దేవరయనుంగులయుంగర మెన్నిభంగులన్. 31

ఉ. దేవర చిత్తగింపవలె దీనికిఁ గారణ మొండు గల్గు మా
రేవులలో మడుంగులకు రేపును మాపును వచ్చి నీట నీ
తోవల సంచరించుఁ గుముదుం డనువాఁ డొకనాగరాజతం
డే వడి నుంగరంబుఁ గొని యేఁగఁగ నోపును నాగభూమికిన్. 32

వ అని జాలరులు పలికిన. 33

గీ. విని వదన ముదయార్క నిభముఁ దోపఁ, గన్ను లరుణాబ్జములకు సంగడముఁ జూప
రోషరేఖాతిరేకసంరూషితాంత, రంగుఁ డై యొప్పెఁ బన్నగరాజు పైన. 34

చ. అజరతయున్ యశఃకౌముదిగఁగు నట్టిదిరై తనతండ్రి రామభూ
భుజుఁడు ప్రియంబు పెంపెసఁగ ముద్దుగ నిచ్చిన దౌట దాని న
క్కుజ మగు శ్రీమచే విడుమఁగా మది నోడి నరేంద్రమౌళి యా
భుజగవరేంద్రునిన్ వెదుకఁబూని రసాతలసీమ కేఁగఁగన్. 35

వ. తనమనంబున నిశ్చయించి పరివారజనంబులను సచివరాజవర్గంబులను సాకేతనగరంబు నకున్ బంచి తొల్లి వాల్మీకి యొసంగిన కామగమనవిద్యాప్రభావంబున నహీనజవంబున నహిలోకంబున కరిగి. 36

శా. కాంచెన్ భోగవతీపురంబు నవశృంగారాంకశృంగాటకో
దంచద్వైభవమున్ సుధాధవళసౌధాలంబకేతుచ్ఛటా
చాంచల్యక్షిపదంబరాంతజలముగ్ధాలోలసత్ఖండమున్
జంచత్సర్వమనోనురంజనకళాసాదంబు మోదంబునన్. 37

సీ. సితచంద్రసౌధభాసితకాంతు లొకచోట, నొకచోట ధూపధూమోద్గమములు
బాలికాసంగీతఫణితి యొక్కొకచోట, నొకచోట వనవాటికోచ్ఛ్రయంబు
పంకేరుహాటవీపవనంబు లొకచోట, నొకచోట పణ్యవీధికలసొబగు
కామిప్రసంగసంగతలీల లొకచోట, నొకచోట వీణారవోదయములు
గీ. నొక్కకేళివను శుకభాష లొక్కతేవ, శారికాపోతకాపోతకారవములు
నరసి హర్షించె భూజాని యఖిలవిభవ, భూషణాభోగవతిని నాభోగవతిని. 38

సీ. ఏరామయైనను బదాతెండ్లకుఁ బైదాఁటు, దేకొమ్మయైనఁ జిగుళ్ళజోక గలది
-రూపు నిసుమంత నేపు వీడనియట్టి, దేవేళలును మనోజ్ఞడితములు
ఎవ్వాఁడు నసలారుజవ్వనం బెనయువాఁ, డేభూమియైనను సస్యశోభితంబు
ఏగృహంబును రమాహేలావతీపదం, బేపల్కులును సుధాదీపితములు
గీ. ఏపదంబును గన్న స్వర్గోపమాన, మెట్టివస్తువు నతిచిత్ర మెవరు నఖిల
విశ్వమోహనసౌందర్యవేషయుతులు, తజ్జగంబున నసమానధర్మనియతి. 39

కం. ఈవిధమున సంతోష, శ్రీవిభవము మదికి నొదవఁజేయఁ బురాంతః
ప్రావృత మగుమహి నెందెం, దేవేవి యొసంగు వాని నెల్లన్ గనుచున్. 40

కం. యాదృచ్ఛికముగ నాభూ, మీఁదారయం దల్లనన్ గ్రమించుచు బహుళా
మోదానుమోదకవ్యా, పాదకమున్ గనియె నొక్కప్రమదావనమున్. 41

ఉ. కాంచి వనాంత మద్భుతముగాఁ గనుపింపఁగ దానిలోఁ బ్రవే
శించి తదంతరాంచితవిశేషములన్ దిలకించి యోగ నా

నంచుఁ దలంచి మంజులసుమాగమవీథులఁ జొచ్చి యందులన్
సంచరణంబు సల్పుచుఁ గుశక్షితిపాలకుఁ డుండె నంతలోన్. 42

ఉ. ఆవనమే కుముద్వతివిహారవనం బయియుండఁ దానిఁగా
భావముసల దెలుంగకయె భానుకులుం డొకచోఁ జరింప నా
శ్రీవనితాజనంబులు సలీలముగాఁ జనుదేర నాకుల
ద్భావముతోఁ గుముద్వతియు వచ్చి మఱొక్కెడఁ దద్వనంబునన్. 43

కం. ఒకపూవుటింటిముంగిటఁ, బికభాషిణి లోలగింప విరహార్తికృశాం
గకశోభ నెనసి తననా, యకుచిత్రఫలకము శయనమం దిడి కనుచున్. 44

శా. రాకాచంద్రునికై చకోరికగతిన్ రాజీవబంధూదయ
శ్రీకై కోకి తెఱంగునన్ నవనభోజీమూతమున్ గాంచఁగా
జోక న్వేచు మయూరభామగతి రాజున్ జూచు చిత్తంబుతో
నాకంజాతదళాయతాక్షి విరహవ్యగ్రాత్మయై యుండఁగన్. 45

కం. కొందఱు కుముదానుజచెలు, లందున్ వనిఁ దిరుగుచుండి యాకడ దవులన్
గొందలిరువిల్తు మించిన, సుందరు నారాజచంద్రుఁ జూచి రయమునన్. 46

గీ. చిత్రఫలకంబునందు రచింపఁబడిన, యాకృతియు వానిపోల్కి యొం డగుచునుండ
నతఁడె కుశరాజుఁగా హృదయముల నెంచి,మఱలి చనుదెంచి సంతోషమగ్న లగుచు.

గీ. చిఱునగవు మోముఁదమ్ములఁ జెంగలింప, నిందుముఖి కాకుముద్వతి కెఱుఁగనీక
కన్నుసైగనె యచ్చటఁ గఱగుచెలుల, కెల్లరకుఁ దెల్పి వారలు నుల్లసిల్లి. 48

వ. దరహాసాంకురపూరితాస్యంబులతో వీక్షితాన్యోన్యవదనలై హాస్యహేలావినోదం
బులగువచనంబుల నక్కుముద్వతిం గాంచి. 49

ఉ. కన్నియ యింతదాఁకఁ గడు గాసిలి యోరుచుకొంటి వెంతయో
యెన్నిదినంబు లింక గమియింతువు కే యిటు, లాతఁ డి తకే
మున్నుగ వచ్చి యుండుఁ దనముద్రిక కిర్వ్వరమాట యేక మ
య్యెన్నిజ మౌను నానుడి మహీపతి తప్పక వచ్చు నిత్తఱిన్. 50

గీ. అనుచుఁ దను మేలమాడఁగా నకట! యిట్టు, లాడఁగా న్యాయమే నన్నటంచుఁ బల్కి
వినమితానన యౌచు ముందునకు నేగి, మొల్లపొద నొక్కపూ మొగ్గ ముట్టఁ బోవ.

మ. ధరణీనాథుఁడు తద్వనస్థలిని సందర్శించి యుద్గదులన్
బరిశీలించి మనోజ్ఞవస్తువుల నప్పద్మాక్షి యున్నట్టిక్రొ

ప్పాలుపుంబొదఁ జేరి ముందునకుఁ దా వేవేగ నేతెంచుచో
నరుదారంగను దారసిల్లె నవలా నాకస్మికం బొప్పఁగన్. 52

గీ. ఇట్లు చనుదెంచి యాశ్చర్య మెనసి యావ, ధూటి యెవ్వతె నా కిటఁ దోఁచు నేమి
భాసితానూనసౌందర్యరాశి యౌర, రమ్యరుచి యౌర బాలికారత్న మనుచు. 53

వ. విస్మితాంతఃకరణుం డై యున్న యపుడు. 54

ఉ. మవ్వపుఁదీఁగఁ బోలు నలమానినియున్ విభుఁ డొండొకళ్లతే
నవ్వెడుగంబులన్ బ్రియమునన్ గనఁబోవఁగఁ దత్క్షణంబ యా
నవ్వులు పువ్వులై మఱి యనంగునిశాతశరంబులై కడున్
నొవ్వఁగ నాటె నాన్నృపతనూభవమౌళికి నవ్వధూటికిన్. 55

చ. అతనిని జూపి యాయువతి నాయువతీమణిఁ జూపి యాతనిన్
శతము సహస్రమున్ తుది నసంఖ్యములౌ శతలక్షకోటులన్
చతురధనుష్కళాపటిమ జాదుకొనన్ గడుఁగుప్పతిప్పలౌ
శితశరముల్ మరుండు గురి సేసి వరుసన్ దనచిత్తవృత్తిగన్. 56

ఉ. పోలఁగ నెంచి యెంచి నరపుంగవురూపముఁ దన్నిరీక్షణా
లోలతఁ జూచి పెంపమటు దళుక్కనఁ బైనలరారురమ్యహా
చేలములోని వక్షమునఁ జేరి బయల్పడవయ్యె బాలకున్
లోలవిలోకనాళి వలలోఁ బడి చిక్కినమీలకైవడిన్. 57

చ. ఎదురుగఁ జూచి చూచి తనయిచ్చ మెయిం దనియంగలేక య
మ్మదగజరాజయాన పాదమాటున వెన్కకుఁ దారి ప్రిక్కగా
నొదిగి కనుంగొనెన్ బ్రియుని యొప్పగురూపము సన్నపైఁటలోఁ
బొదలెడుగుబ్బ లుబ్బి యొఱపుందన మూని దొబూచులాడఁగన్. 58

ఉ. చూచినఁ జూడకుండుఁ, దనుఁ జూడక యుండినఁ, జూచు నిల్వఁగాఁ
జూచిన యోగఁజూచుఁ, జనఁజూచిన నచ్చటె నిల్చుఁ, జెప్పనా
నే చెలిచెయ్దముల్ మఱఁ డొకించుక నూదికి సం దొసంగఁ బ్రే
రేచి గజమ్ముఁ ద్రోయ వివరింతురు కాంతలు జాణ లెంతయున్. 59

చ. కని కని ప్రేమభావ మధికంబుగ, నంత జనించునట్టి సి
గ్గున మఱియొక్కమా ఱొదిగి కోపగుజూపున నోరఁ జూచి ది
గ్గునఁ బ్రియకాంత లున్నయెడకున్ జనియెన్ నరనాథుధైర్యముల్
తునియలుగా మరుం డొఱకు దూసినబాకు తెఱంగుఁ జూపుచున్. 60

గీ. ఇటులు చనుదేరఁ జెలులెల్ల రిందువదనఁ, గాంచి యుపచారణం బొనరించి కించి
దంకురితహాసమధురాస్య లగుచు హాస్య, గరిమ దైవాఱ సారస్యభరము మీఱ.

ఉ. ఎక్కడి కేగ దింకఁ దరళేక్షణ! యింతటి వాఁక నవ్వహం
బక్కజ మాతమిన్ వలపులాడి యిటుల్ వగ లెన్నొ చూపె ద
మ్మక్క! యెఱుంగ నెంతొ హృదయంబును గాఢవిమోహితాత్మ వై
చొక్కుచు నింతసిగ్గు మనమ్మునం బడనేల? ఫలోన్ముఖంబునన్. 62

ఉ. వేఁడి వరించి తీవు రఘువీరకుమారుని వానిఁ దోడి తేఁ
జూడ వనస్థలంబునకుఁ జోద్యముఁగాఁ జనుదెంచె నాతఁడే
యీడిత మైనభాగ్య మన నిట్లెసఁగన్ దగుఁగాక మేలు మే
లాడఁగఁ బోవఁ దీర్ఘ మెదు రయ్యెను నీకు సరోజలోచనా! 63

కం ధరణీధవుఁడఁట సమ్మద, కరుఁ డఁట తలవనితలంపుగా వచ్చినచోఁ
బరిచర్య లిడవె వినవే, యరయఁగ "నభ్యాగత స్స్వయం విష్ణు" యనన్. 64

కం. అని నగుచుఁ గుముద్వతిచేఁ, గొని యెచటికి నేగ దోచకోరనయన! నీ
వని పెనఁగ విదిర్చుక య, వ్వనితామణి యోగఁ బొదలపజ్జకు లజ్జన్. 65

ఉ. ఏగుటె కాని యాయువతి కించుక నిల్కడ దోఁప దమ్మహా
భాగుని వీడి వచ్చుటకు భావమునందు మఱొక్కమాఱు సా
భోగరతిన్ గనంగఁ దలపోయుచునే చనె; నాత్మకాంతసం
యోగమువేళ నెచ్చెలులాఱె యున్న మఱింతకు ఖేద మున్నదే. 66

శా. ఆలీలావతి యేగ మోహభర మింతంతం చనన్ రాక ని
ర్వేలశ్రీ వహియింప నివ్వనము నారీసంవృతం బేటి కీ
లీల న్వచ్చితి నంచు సంశయగతుల్ నిర్వేలమోహంబు నాం
దోళస్ఫూర్తి ఘటింపఁగా నృపతికిన్ డోలాయమానాత్ముఁడై. 67

చ. వెనుకకు నేగఁ బోవఁ బృథివీవరనందనుఁ గాంచి, స్వర్ణమా
లిని! యిటు వచ్చి నేఁగ గదళీపరివేష్టితమంటపంబుపై
నను నఱపుఁడు మేల్జిలుఁగునాడెఁ పుఁగ్రొత్తతివాసి యంచుఁ దా
ననుచు వసంతవల్లరి తదజ్జవిలోకన లట్లు సేయఁగన్. 68

గీ. ఎదురుగా నేగి దయచేయుఁ డిచటఁ గొంత, విశ్రమింతురు గాక యధ్వశ్రమంబు
వోనడప నన్న నమృతంపుసోన చెవిని, గురిసినట్లుగఁ దోఁచె నాధరణిపతికి. 69

కం. ఆరామామణిచే నిట్లు, లారాజకుమారుఁ డధిగతాహ్వానుండై
యారామసీమఁ దనమన, మార న్వసియించెఁ గదళికావృతవేదిన్. 70

వ. ఇట్లారాజశ్రేష్ఠుం డుపవిష్టుం డై యమ్మానినీమణి కి ట్లనియె. 71

ఉ. సారసనేత్ర! దివ్యకుసుమసంయుత మై యలరారునివ్వనం
బేరిది యీవధూజనము లెవ్వ రటంచుఁ గుముద్వతిన్ గరం
బోరఁగఁ జూచి పల్కఁగఁ దలోదరి యి ట్లని పల్కె నవ్వుచున్
సారశుకీసఖోక్తికలనాకలనాదవినోద మేర్పడన్. 72

ఉ. ఎం దయి వచ్చినారు పృథివీవరనందన! కొంత విశ్రమం
బొంది యనంతరంబున మదుచ్చరితార్థము సావధానులై
విందురు గాక, సర్వజనవిశ్రుతకీర్తులు మీరు మీకు మే
మిందులఁ గ్రొత్త లైన వినుఁ డీరలు క్రొత్తలు గారు మా కికన్. 73

ఉ. మీ కమనీయకీర్తియు నమేయగుణాఢ్యతయున్ బ్రతాపసు
శ్రీకత విక్రమోర్జితవిశేషములన్ దిలకించి యెన్నఁ డీ
లోకముఁ జూడ వత్తు రని లోఁ దలపోయుచు నుండు మాకు మీ
రాక తగెన్ బికావళికి రమ్యవసంతసమాగమం బటుల్. 74

కం. ఈవనము నాదుచెలి యగు, నీవనజాతాయతాక్షి దిక్కన్యకయున్
భావితసద్యశుఁడు భుజం, గావనిపతి యైనకుముదు ననుజాత యగున్ 75

కం. అతులితరూపవిలాసాం, చిత యగు నీనా దనుఁగుఁజెలి పేరు కుము
ద్వతి యనఁగఁ బరఁగు భుజగ, క్షితిపతి కుముదునకుఁ బ్రియము సేయుటకలదై.

చ. గొనములచేవ సత్కళలకోవ నయమ్ములదొంతి బాలికా
జనముల కోజబంతి నృపచంద్రమ! యీభుజగేంద్రకన్య పా
వనకమనీయతాకరభవచ్చరితంబుల నిచ్చలున్ బ్రియం
బొనరఁగ వించు నువ్విళుల నూరును మీప్రియదర్శనార్థమై. 77

ఉ. మానవనాథ! మీ కిచట మా టొనరింపఁగ నేల యింక ని
మ్మానవతీలలామ పరిమండిత మైనభవద్విలాసితా
నూనవిశేషము ల్విని మనోజవశంబున మీపదాబ్జసం
దానితచిత్త యయ్యె విరిదమ్మికి నై యళికాంతపోలికన్. 78

గీ. ఆర్తరక్షణపరత మీ యన్వయంపు, రాచవారలమర్యాద లై చెలఁగుటఁ
గృప దలిర్పఁగఁ గాచి యక్కీరవాణి, నధిప! గాంధర్వమునఁ బెండ్లి యాడ వలతు.

చ. అని యనునంతలోన హృదయాంతరమం దుదయించి మించి బ
గ్గున మదనానలంబు దరికొన్న నతండును గొంత కొంత కాం
తిని బొదివింపఁజేసి సుదతీమణి! నే నితరార్థకాంక్షినై
పనివడి వచ్చి యిప్పనికిఁ బాల్పడు టెట్టిసమంజసం బగున్. 80

కం. ఏ నొకముద్రాభరణముఁ, గానఁగఁ జనుదెంచి యీజగంబునందున్ మీ
మానవునిఁ గాంచి మార్గవ, శానీతుఁడ నైతి నిచటి కంబుజనేత్రా! 81

గీ. అనుచుఁ దనలో విమోహవిహ్వలతఁ గొంత, మాటు వడఁజేసి యీరీతి మాటలాడు
ధరణినాథుని గాంచి యత్తరుణి పల్కెఁ, గొనబుఁ జిఱునవ్వు కెమ్మోవిఁ గునిసియాడ.

చ. అరుణకులేంద్ర! మే మెఱిఁగినట్టిదె మీసరయూస్రవంతి కాం
తరసలిలాభిషేచనవిధంబుల నందులనుండి మీరు మా
పరిసరభూమి కీపగిది వచ్చుటకై భవదీయముద్రికా
భరణము నేను తెచ్చితిఁ గృపం గొని, మీ రిది సైపఁగాఁ దగున్. 83

గీ. కన్యకాముద్రికాపరిగ్రహణ మొనసి, యరసి "యేకక్రియా ద్వ్యర్థకరి" యటన్న
కరణి మీరాక సఫలతఁ గాంచ నీమెఁ, గైకొనుం డన్న నమ్మహీకాంతుఁ డనియె.

ఉ. ఇంతటిమాత్రచేఁ బరిచయేతరతన్ గని యున్న నాదు మీ
కాంత కెటుల్ వివాహయుతకౌతుకముల్ దగు నింతె కాక య
త్యంతనయప్రవృత్తిపరు లౌనరపాలురకున్ వధూమణీ
చింతన మే ప్రధానమొకొ చిత్తమునం దలపోసి చూచినన్. 85

వ. అనిన నమ్మహీవరున కయ్యహిమహిళామణి యిట్లనియె. 86

చ. పరిచితి లే దటంచు నిటు పల్కఁగ నేటికి మీయనుంగుటుం
గర మిది మున్నె మార్పఁబడెఁ గా దొకొ మాసరసీరుహాక్షి కి
త్తెఱఁగె వివాహమూల మయి; దీపితలీల "శుభస్య శీఘ్ర"మం
చరమర లేక మాకువలయాక్షిని వేగఁ బరిగ్రహింపుఁడీ. 87

గీ. తెలియరె నయమ్ము లిటుఁ బల్కఁదలఁచి కాక, వాకొనుట "రత్నహారీతుపార్థివ"యను
న్యాయమునఁ గన్యకారత్న మైననీమెఁ, గైకొనఁగ ధర్మభంగంబుఁ గలదె తలఁప. 88

సీ. కసుగంది నిట్టూర్పు గాడ్పుచేఁ బైనిగ్గు, పాలివోవుచిగురుకెమ్మోవిదాని
భవదీయసౌందర్యవశ యౌచు నొంటిమై, నొదిగి విహ్వలవృత్తి నున్నదాని
విప్రయోగక్లిన్నవిధురాంతరంగయై, యాపాండురకపోల యైనదాని
లులితచూర్ణాలకాకలితలక్ష్మం బైన, కమనీయఫాలభాగంబుదాని

గీ. నీవధూమణి దయమీఱ నేలినంత, నార్తరక్షణసుకృతంబె యగును గాని
కలుగ దింతయు మీకు నఘప్రవృత్తి, విశదలసమానగుణసాంద్ర! కుశమహీంద్ర! 89

శా. రాజగ్రామణి! మీ కెఱుంగనిది ధర్మం బేది మాచేత నీ
రోజల్ గాఁ బలికింతురే గాక మును న్నార్యుల్ దామ వాక్రువ్వరే
"రాజానో బహువల్లభా" యనుచు సారస్ఫూర్తి నా రీతి మా
రాజీవాక్షిఁ బరిగ్రహింప నయమార్గం బబ్బదే మీ కిటన్. 90

మ. అని తన్నిష్టపదంగఁ బల్కు చెలికిన్ హాసస్ఫురచ్చంద్రికల్
మును కొన్నాననచంద్రమండలముపై భూమీకళత్రుం డనున్
వనితా! మీఫణివల్లభుం డెఱుఁగకుండన్ నాదుముద్రామణిన్
గొనఁగాఁ జౌరుమలోప వా నరయ మాకున్ రాజలోకంబునన్. 91

ఆ. ఎదిరి మీభుజంగపృథివీంద్రు నడిగి కై, కొందుఁ గాక యియ్యకొనక యున్న
సకలదేవవినుతసమరాంగణంబునఁ, గొందుఁ గాక కరుణనందబోక! 92

కం. ఏకరణి నైన ముద్రికఁ, గైకొని తదనంతరంబ కాంతామణి! నే
మీకుముదనయనఁ జేకొని, మీకు ముదము సేయుదున్ సమీహితవృత్తిన్. 93

వ. అని వారలనొడంబఱచిన వారును మహాప్రసాదం బని యియ్యకొన నతం డప్ప
దేశంబు విడిచిచనుదెంచునవసరంబున. 94

సీ. మిష వెట్టి యేదేని మేదినీపతి యేగు, వంకకే దృష్టులఁ బఱపి చూచు
మరలఁ దన్నొకమాఱు మఱలి వెక్కసుఁ జూచు, నోయంచు లోలోన నూహసేయుఁ
దన్ను మనున్నాతండు తారసిల్లిన యట్టి, సమయంబుఁ దలపోసి సంచలించుఁ
బొదలఁ దోఁపులలోనఁ బొదలుచిల్కలపిండు, వెసనించు రొదలకై విసువుఁ జెందు

తే. నిట్టిచేష్టలఁ గని చెలు లేమి తన్ను, నపహసింతురో యని సంశయమ్ముఁ జెందుఁ
గంతుమార్గణసంతతక్రాంత యగుచు, వంత నంది కుముద్వతీకాంత యంత. 95

వ. మహీవల్లభుండును మనోజమార్గణవేధితాంతరంగుండై యక్కాంతామణిం దలం
చుచు వనమధ్యంబున కేగి యం దొక్క కుసుమలతానికుంజంబున నాసీనుం డై తన
మనంబున ని ట్లని తలపోయందొడంగె. 96

ఉ. పున్నమచందమామ సరిపోలెడుముద్దుమొగంబు హాస మన్
వెన్నెలఁ గాయుచుండ సుమవిస్తృతగుచ్ఛ మనంటిదూటులన్
వన్నెలు దిద్దుహస్తమునఁ బట్టి రసాలముపొంత నున్న య
క్కన్నియసోయగంబు గనఁగావలెఁగా వెలుఁగారువేడుకన్. 97

ఉ. నడలబెడఁగు, పెందొడలనాడెము, కావిమెఱుంగుమోవిఁ జొ
ప్పడుసిరి, యౌవనమ్ముచెలువమ్ము, జగాజిగి నీనుమేనిపై
నొడికము, గబ్బిగుబ్బకవయొప్పిదమున్ గనుఁగొన్న నార! య
ప్పడఁతుకఁ గాఁగిటన్ జొనుపుభాగ్యమె భాగ్యము కాక యన్యమే. 98

చ. అలసరసీతటంబున మదాళికులంబులు మ్రోఁత వెట్టుపూ
వులపొదపొంతఁ బూవుఁ గొనఁ బోవుచు నన్నటుఁ గాంచి వెన్కగా
మలఁగి క్రమించువేళ నొకమా టిటు చూచినయట్టిచూపునన్
గల వెల యింత యంత యనఁగా జనునే ఘననీలవేణికిన్. 99

కం. అనుచున్ దరుణీమణిపై, ననుచున్ దనచిత్తవృత్తి నంచితకదళీ
వనమాలికాలతాంకిత, ఘనమానిక్షపవనములరు భావముఁ గలఁచున్. 100

వ. ఇవ్విధంబునఁ గొంతవడి యవ్వనప్రదేశంబున నుండి యెట్టకేలకు మద్రికోపాహరణ
దీక్షితుండై యవ్వనప్రదేశంబు వీడి రాజమార్గంబు సొత్తెంచె.

ఆశ్వాసాంతము.

శా. కల్యాణాంచితనిత్యవైభవసమగ్రశ్రీసమున్మేష! సా
కల్యప్రస్తుతిపాత్రతాచతురతాకాంతస్ఫురద్భూష! సా
ఫల్యానూనజనుర్విశేష! రసగుంభద్వాక్కళాశేష! ని
స్తుల్యోత్తుంగపవిత్రతానిహతచేతోదోష! సత్పోషణా! 102

కం. కవితాపరిపాకమధూ, ద్భవసారరసజ్ఞ! మధురభావస్ఫురణా!
భువనప్రథితారామ, ద్రవిడాన్వయపూర్ణిమాసుధామయూకిరణా! 103

ప్రియంవదావృత్తము. పరిచితీకృతవిపశ్చిదుచ్ఛ్రయా!
విరచితార్యపదవీసమాశ్రయా!
ఉరుతరోపకృతియుక్తిలాలసా!
పరవధూవిముఖభవ్యమానసా! 104

గద్యము.

ఇది శ్రీవాలఖిల్యపవిత్రగోత్రోద్భవ వేంకటరత్నాంబికా
బాపనార్యతనూభ వాంధ్రగీర్వాణభాషాసనాథ
ద్విభాషి సోమనాథకవిప్రణీతం బైన
కుముద్వతీపరిణయం బను
మహాప్రబంధంబునఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# శ్రీకుముద్వతీపరిణయము

## పంచమాశ్వాసము.



కలితజలజవరచ
క్రకృతిరేఖావిభాసిహస్తాంబుజ! లో
కైకశుభలక్షణప్రక
రాకర! శ్రీవేంకటేశ్వరార్యప్రవరా!

వ. అవధరింపుము తదనంతరంబునఁ గ్రమంబుగాఁ గుముదు నగరువాఁకిట జేరి ద్వారపాలురచేఁ దనరాక నతని కెఱింగించుటయు నాతండును దనచెలియలియొద్దఁ దదీయముద్రాభరణం బున్నయట్లు వసంతవల్లరిచే నెఱింగినవాఁ డయ్యును దత్ప్రభావపరిలుబ్ధుం డై దాని నియ్య నొల్లక నిరాకరించినంత. 2

మ. గుణనిక్వాణము మీఱి దిక్తటములన్ ఘూర్ణిల్లఁ గోదండభీ
షణనమ్రీకరణంబు మండలముగాఁ జంచన్నిశాతోరుమా
ర్గణసంధానము సేసి భూరమణుఁ డుగ్రక్రోధరేఖాకిర
ద్రిణసంరంభవిజృంభితోజ్జ్వలపరాక్రాంతిక్రమోదాత్తుఁ డై. 3

కం. గుణనిస్వన మాకర్ణిన్, రణసూచన సేయ నాగరాజును సేనా
గణకలితుఁ డగుచు సమరాం, గణమున కేతెంచె నాజికౌతూహలి యై. 4

సుగంధివృత్తము. రంగదత్యరోత్సగత్తురంగమప్రమత్తమా
తంగసంఘసంకులద్రథప్రధావనోద్ధతా
భంగఘోషమై యుదాత్తభంగసంగతాబ్ధినా
సంగరం బెసంగి పొంగె సద్భటానుషంగమై. 5

వ. ఇవ్విధంబున మహోదగ్రసంరంభం బై యారణసమారంభం బుండునంత. 6

ఉ. పన్నగవీరు లొక్కట నభస్థలి బాణపరంపరన్ బరి
చ్ఛన్నము గాఁగఁ గుప్పి రభసంబున నాకుశరాజచంద్రుఁడ

రోషస్థితిఁ జుట్టుముట్టుచుఁ గరోద్ధతశంఖములన్ నినాదముల్
మిన్నులు ముట్ట నొత్తి రతివేలరణప్రవణత్వ మేర్పడన్. 7

కం. శరసమితిఁ బరపి చుట్టిన, యురగులఁ దచ్ఛరచయముల సర్వపతియున్
నఱిమాడి కుముదఫణిభూ, వరునరదముఁ దాఁకె శౌర్యవత్త్వము మెఱయన్. 8

చ. కదిసినభూమిపాలు నురగక్షితిపాలుఁడు రోషభీషణో
న్మదుఁ డయి శ్రేణిసేసి శితమార్గణముల్ గురిపింప నన్నియున్
జెదరఁగ నేసి వెండి జఱచెన్ నిశితాశుగముల్ కుశుఁ; డిటుల్
పొదివిరి కాంక్ష గైకొని యపూర్వపరాక్రమ మాక్రమింపఁగన్. 9

ఉ. కొండొకసేపు వా రిటు లకుంఠితలీలఁ బెనఁగి యంత ను
ద్దండతరాస్త్రరాజిపరిదర్పితుఁడై కుశరాజు గారుడా
ఖండమహాస్త్రరాజ మురగక్షితిమండల మెల్లఁ బెల్లుగా
బెండు వడంగఁ జేయఁ గొలిపెన్ భుజగక్షితిపాలవాళిపై. 10

శా. హాహారావముతో భుజంగభువనం బల్లాడె దిగ్దంతిసం
దోహంబుల్ జలియించె శేషుఁడు శిరస్తోమంబు వంచెన్ నిరు
త్సాహం బయ్యెను జీవలోకము తదస్త్రస్నిగ్ధసందీప్తిమ
న్మాహాత్మ్యంబు విజృంభమాణ మగుచున్ వర్తిల్లఁగా నత్తఱిన్. 1

వ. ఇట్లు భుజగలోకప్రళయకరంబై యమ్మహాస్త్రంబు వెలుంగ దాని నేమియుం
జేయనేరక కుముదుండు వెఱచి ముకుళితకరకమలుండై కుశరాజుకడ కేతెంచి. 1

చ. జనసుతశీల లక్ష్మి యగుజానకికిన్ రఘునాథశౌరికిన్
దనయుఁడ వుగ్రతేజుఁడ వుదగ్రత ని న్నెదిరింపఁ జెల్లునే
యని నను గావు నావుడు తదస్త్రముఁ దా నుపసంహరించి చే
కొనెఁ గుశుఁడున్; మహామహులకోపము దీర్ఘము గా నెసంగునే. 1

కం. భూరమణుఁ డస్త్ర ముపసం, హారముఁ గావించినంత నతనికిఁ బ్రియ మే
పారఁగఁ దనముద్రిక నిడి, గౌరవమునఁ గుముదుఁ డిట్లుగా వచియించెన్. 1

ఉ. రాజకుమార ! నీదుసఖురస్తుతనైపుణికిన్ బహూకృతి
వ్యాజము గాఁగ మాచెలియ లా సుమనోహరశోభితాంగి నం
భోజదళాయతేక్షణఁ గుముద్వతి నాఁ జను కన్యకామణిన్
రాజితలీలఁ గైకొని త్వరన్ నను ధన్యుని జేయఁ గోరెదన్.

వ. అని యిట్లు ప్రార్థించినంతఁ గుశమహామహీరమణుండును ధనుస్సమాకర్షణసంల
మాన యగునక్కన్యకన్ సాక్షాద్విజయలక్ష్మింగాఁ దలంచి పరిగ్రహింప నంగీకరిం

నంతఁ గుముదుఁడును దనరాచనగరున నొకయుద్యానవనప్రదేశంబునఁ జంద్రశిలావినిర్మితం బైన యొక్క హర్మ్యంబు విడిదిగా నొసంగి తగుపరిచర్యలకు సేవకుల నియోగించి. 16

కం. పుర మెల్ల నలంకారా, స్ఫురితముగాఁ జేయుమనట్లు భోగివనగరి నం
దటి కెఱుఁగఁజేసె నంతటఁ, బరమామోదంబు నొంది పౌరజనంబుల్. 17

ఉ. పురిఁ గల రాజవీథుల కపూర్వముగాఁ జెలువంపు జల్లపం
దిరుల రచించువారు జిగిఁ దీఱిన మేల్జల తోరణజాలరుల్
వరుస నమర్చువారు హిమవారిని జల్లుఁ జల్లువారు బం
ధురముగ నాణిముత్తియఁపుఁదోరణాలన్ గయిసేయువారునై. 18

గీ. పురుషు లిటు సేయ నంగనల్ ముంగిళులకు, రంగు మీఱంగ ముత్యాలుగంగవల్లు
లలవరించియు రమణీయహర్మ్యసంచయములఁ గైసేసి యగరుధూపముల నిడియు.

వ. తమ తమ మందిరంబుల మనోహరరత్నమాలికాలంకృతద్వారంబులుగాఁ జిత్రవర్ణపరిశోభితంబులుగా నగరి నంతయు శృంగారించి రంతఁ గుముదుండును భూసురోదితం బగు నొక్క సుముహూర్తంబు నిశ్చయించె నప్పుడు వివిధవారాంగనానృత్తసంగతసంగీతరవంబులతోడను, మంగళతూర్యనాదంబులతోడను, గాయకవైణికవైణవికమార్దంగికమృదుమధురస్వనంబులతోడను భోగవతియంతయుఁ గలకలాయమానంబై వివిధదేశాగతజనసమ్మర్దంబై యుండె నంత నంతఃపురంబునఁ గాంతాజనంబు లత్యంతసంతోషితాంతఃకరణ లగుచు నొక్క విశాలసౌధోపరిభాసమానవేదికపైఁ గుముద్వతి నాసీనఁ జేసి పరివేష్టించియుండి రపుడు. 20

ం. భాసిల్లి శుభము లెసఁగం, గా సరగన్ బెండ్లికూఁతుఁ గమ్మని యాశీ
ర్వాదసంగ లగుచు సేసలఁ, బోసిరి ముత్తైదువలు కుముద్వతి కంతన్. 21

కం. కుందనమునందుఁ గలతళు, కుందనముల్ దొరయునట్టి కోమలి మెయికిన్
జందనము పసపు నలుఁగిడి, చందనసమగంధు లెల్ల జలకము లార్చన్. 22

వ. కుముద్వతియును గమనీయగంధోదకస్నానమనోహారిణి యయ్యె ననంతరంబున. 23

చ. తల తడి యార్చి నూత్నపరిధానము లొసఁగ నిచ్చి కప్రిమున్
దిలకముఁ బెట్టి మౌక్తికమణీమయహారచయంబు దీప్తిమం
గళగళసీమఁ దార్చి విరికచ్చుల వాల్జడపై నమర్చి య
చ్చెలువలు పెండ్లికూఁతుఁగఁ జేసిరి పన్నగరాజకన్యకన్. 24

కం. అసదృశగతిఁ గుశుని సము, ల్లసితహిమాంబువుల మంగళస్నాతునిఁగా
వెసఁ జేసి చెలులు బంగరు, టాసపరిజలతారువలువ లొసఁగిరి మఱియున్. 25

వ. అనేకరత్నభూషణభూషితుండై యతండు కర్పూరతిలకంబుఁ దీర్చియుండె ననంతరంబున సుముహూర్తంబు సమీపింప.

ఉ. చంద్రసముజ్జ్వలాంగుఁడు కుశక్షితిపాలకమౌళి చంద్రికా
సాంద్రమనోహరం బగునిశన్ బరిమండితవజ్రదీప్తి ని
స్సంద్రవివాహవేదికకుఁ దాఁ జనుదెంచెఁ బురోహితాదివి
ప్రేంద్రులు బంధుగుల్ కుముదుఁ డెల్లరు నందు వసించియుండఁగన్. 27

కం. చెలువఁ గుముద్వతి మిగులన్, జెలువుగఁ గైసేసి యనుఁగుఁ జెలు లెల్లరు మం
జులవైవాహికవేదీ, స్థలికిన్ గొనితెచ్చి రధికసమ్మదయుతలై. 28

చ. వెలఁదుక లక్ష్యధూవరుల వేడుకఁ బెండిలిపీఁట నిల్ప ని
ర్మలపరిపూతవేదయుతమంత్రచయంబుఁ బురోధసుండు ప్రో
జ్జ్వలతఁ బఠింప మేల్పసిఁడిపళ్ళెమునన్ గుశరాజుపాదముల్
దొలఁచి ప్రియంబు మీఱఁ గుముదుండును గన్యక ధారవోసెనన్. 29

ఉ. వెల్లుగ మంగళధ్వనులు విన్నులు ముట్టఁగఁ గాంచనప్రభా
వల్లసమానరత్నమతిపాత్రము మంగళసూత్రమున్ మహీ
వల్లభుఁ డావధూటిగళభాగమునన్ ఘటియించె బాలికా
వేల్లితచామరాంచలనివిష్టమరుత్ప్రసరంబు పైకొనన్.

వ. తదనంతరంబున.

చ. లలితము లైనమౌక్తికములన్ దలఁబ్రాలుగఁ బైఁడిపళ్లెరం
బుల వడి నించి క్రిందలిరుఁబోఁడులు తెచ్చి యొసంగ వాని నా
కలికి నిజేశునౌదలను గాంతుఁడు తత్ప్రియకాంతయౌదలన్
విలసితలీలఁ బోసి రతివేలనవప్రమదోదయంబుగన్.

క. ప్రవిమలగతిఁ గంఠధ్వని, సవరిచి యాశీర్వచస్సు సల్పిరి మిగులన్
వివరముగా "శతమానం, భవతి శతాయుః" వని విప్రవర్యులు వేడ్కన్. 33

గీ. మంత్రతతితోఁ బురోధసోమండనుండు, వెలయఁ జేసినయగ్ని నుర్వీవిభుండు
నాజ్యముఖ్యమైనహవ్యంబు నందు వేల్చె, వేదపరిమండితాచారవిధు లెసంగ. 34

గీ. హర్షభావంబు మదిలోఁ బ్రకర్షితముగ, నెడనెడ మనోహరునిరూప మెంచి కనుచు
సప్తపాదక్రమంబును సంతరించెఁ, గాంతగతితోఁ గుముద్వతీకాంత యంత. 35

వ. ఇవ్విధంబున నరుంధతీదర్శనంబును లాజహోమంబును మున్నుగాఁ గల వైవాహిక విధులతో నుద్వాహంబు యథోచితక్రమంబుగా జరిగె నంతఁ గుముదుండును బహువిధరత్నగంధసింధురసైంధవాద్యుపథానంబులఁ గుశరాజున కొసంగి విప్రవర్యుల

బహువిధబహూకృతిహర్మ్యపరిష్కరితాంతరంగులుగా షడ్రసోపేతభోజనులుగాఁజేసి నిఖిలబాంధవభోజనక్రియాసన్నాహసమారంభంబునకుఁ దనవారల నియోగించె నప్పుడు. 36

మ. ఒకసౌధాంతరమందు రత్నమయమై యొప్పారురమ్యస్థలం
బకలంకంబుగఁ జేసి నూత్నరమణీయంబైనరత్నాసన
ప్రకరంబున్ క్రమరీతిగాఁ సరది దీవ్యద్రత్నపాత్రంబులన్
సకలామోదకరంబులై వెలయుభోజ్యంబుల్ వడిన్ నించుచున్. 37

చ. పొలుపగునవ్వులే యచటఁ బ్రోవులు పడ్డవో యన్నరీతిగా
మిలమిల లాడునన్నమును మేనులపై నవకాంతిపూరమే
యలరెనో యట్టుగా నవఁగ నచ్ఛములై తగుపాయసాన్నముల్
తొలుకరిమించుఁదీఁగలటుఁ దోఁచుచు వడ్డనఁ జేసి రంగనల్. 38

వ. మఱియును.

శా. సూపంబున్ ఘృతమున్ వడల్ వడెములున్ శుంభత్సహయ్యంగవీ
నాపూపంబులు బూరె లప్పడము లింపౌ పాలకోవాలు మా
ధ్వీపూరంబులు మున్నుగా రుచిరతన్ దీపించుభోజ్యాదికం
బాపూర్ణేందునిభాస్య లెల్లరకు నెయ్యం బొప్ప వడ్డింపఁగన్. 40

మ. దరహాసంబులతోడ మేలములతోఁ దాత్పర్యభావంబుతోఁ
బరమాన్నాదికభోజ్యముల్ కనకసత్పాత్రంబులన్ బందుగుల్
బరితుష్టిన్ భుజియించి రంబుజముఖీవక్షోజసీమాళితో
నరుదారన్ దమసత్కటాక్షములసయ్యాటల్ వెసాళింపఁగన్

కం. మధుసంయుతభక్ష్యంబుల, మధురాధరపంక్తికివియె మా యనురీతిన్
మధురోష్ఠులు మా తిడి మ్మన్మధురోపము సేసి రచటిమగవారలకున్. 42

గీ. పూవుఁబోఁడులు వడ్డింప భోజనములఁ, దనిసి యీరీతి సకలబాంధవజనంబు
శీతలంబైనపన్నీటిచేఁ దదాస్య, పాణిపాదంబుఁ దొలఁచి రప్పట్టునందు. 43

ఉ. కొందఱుమందగామిను లకుంఠితనవ్యపరిమళంబులన్
జెందుమృగీమదాదికవిశేషమనోహరవస్తురాజితో
నందము నొందఁ గ్రొత్తకపటూరులఁ బళ్లెములం దమర్చి చే
నంది యొసంగఁ గైకొనిరి హర్షరసోదయ మంది బందుగుల్. 44

వ. కుశరాజును కృతభోజనుండై వీటీనిషేవణంబు సేసి యనంతరంబున నయోధ్యాపుర
గమనోన్ముఖుండై యుండఁ గుముదుండును నొక్కయనుచరుం బంచి కుశాగమనం

బరయోధ్యలోనివారల కెఱుంగం జేసె నిక్కడఁ గుముద్వతియును నాత్మబాంధవ
విశ్లేషంబునకు సముదితం బైన కించిద్దైన్యంబున నుండునవసరంబున. 45

గీ. కుముదుసహధర్మచారిణి విమలరత్న, చిత్రమాల్యాంబరాదిసుశ్రీల నొసఁగి
యక్కుముద్వతి కింపార నామె మాన, సావిలత్వంబు నుడుప నిట్లని వచించె. 46

ఉ. వేఁడి వరించి తీవు రఘువీరకుమారుని యంతవాని, లో
కేశితజానకీత్రిభువనేశ్వరి కోడలి వన్నెకెటిపే
ర్వాడి గడించికొంటి వినవంశమహీధవరాజ్యలక్ష్మి నై
దో డనిపించుకొంటి విఁకఁ దొయ్యలి! నీకు విచారమేటికిన్. 47

గీ. మగఁడు లోకైకవీరుండు మహితకీర్తి, మెట్టినది రాచకొలములో మేలుబంతి
భాగ్య మన్న నో మాహేంద్రపదసమంబు, కోప మేటమ్మ! నీకు విలోలనయన! 48

కం. అనుచుఁ దనముద్దుమఱఁదలి, మనమున ఖిన్నత్వమెల్ల మానిపి తమిఁ జే
కొని బుజ్జగించి కుముదుని, యనుఁగుంజెలి సంతతప్రియంబునఁ దేల్చెన్. 49

వ. కుముద్వతి నెచ్చెలియలు నామెం గాంచి సంతసించి. 50

గీ. మనకుముద్వతి పూర్వజన్మమున నెంచి, మంచిరతనాలఁ బూజ గావించుకొనియెఁ
దనకుఁ దగినట్టిభువనసుందరుని వరుని, బడసెఁ దలపోయఁగ నదృష్టవతి గదమ్మ. 51

కం. అనుకొనుచు నావధూమణి, ననువుగఁ గైసేసి పతిగృహంబున కనుపన్
మునుమున్న దోడ్కొని కుశా, వనినాథునికడకు వినయభావముతోడన్. 52

వ బాలామణికరం బతనికరంబున నునిచి

శా. రూపంబున్ గయికొన్న తాలిమి కళారూఢైకధామంబు శో
భాపూర్ణత్వము పట్టుఁగొమ్మ సుగుణవ్రాతంపుఁబా తొట్టఁ బూ
వో పూవో యని చూచుకొంటి మిటు నీపూఁబోఁడి నీమీఁద నీ
ప్రాపున్ జూపితి మెట్లుగా మనిపెదో పద్మాప్తవంశాగ్రణీ! 54

కం. అని చెలియ నప్పగించిన, జనపతియు నయోధ్య కేగుసన్నాహంబుం
బొనరించుచుండఁ గుముదుఁడు, తనచెలియలి కొసఁగె నధికదాసీజనమున్. 55

వ. తగుపరివారంబుతో భోగవతీనదీపర్యంతంబు సాగంబనిచి మగిడి తననివాసంబున
కరిగె నిక్కడఁ గుశుండును దారదాసికాపరివారజనసమేతుండై సరయూనదీతీరంబు
సేరి యయోధ్య కరుగం బోవుసమయంబున. 56

మ. తనరాకన్ విని బాంధవుల్ హితు లమాత్యవ్రాతముల్ దత్పురీ
జనమున్ దా మెదు రేచు వచ్చి యతిహర్షం బొంది యమ్మానవేం

ద్రుని శుద్ధాంతనిలయస్త్రీజనములన్ దోడ్కొంచు హేమోల్లస
ద్వినుతస్యందనరాజిపైనఁ బురవీధిన్ వచ్చునప్పట్టునన్. 57

చ. పరమసురూపభాసి మనపట్టపురాజొక నాగకన్యకన్
బరిణయమాడి యీ తెరువునన్ జనుదెంచుచు నుండెఁ జూత మో
సురుచిరగాత్రులార! యనుచున్ బురసుందరులెల్లఁ జంద్రకాం
తరుచిరసౌధరాజిపయినన్ నిలువంబడి చూచి రవ్విభున్. 58

సీ. కేడఁ గల్గు నొకహేమకీలితస్తంభంబు, నాని కన్గొనె నొక్కహాటకాంగి
జడమల్లెవిరికచ్చు సవరించుచును వచ్చి, ముదమూఱఁ గనె నొక్కపుష్పగంధి
వదనగంధాహూతమదభృంగనిచయంబు, విసరుచు గనె నొక్కబిసరుహాస్య
జాలకంబులఁ గటాక్షమనోజ్ఞకిరణాళి, సారించి కనె నొక్కచంద్రవదన
గీ. బిగువుచన్గట్టు సగము గన్పించునటులఁ, జేయి ద్వారోపరిస్థలిఁ జేర నెత్తి
కొమరుగాఁ గనె నొకకులుకుగుబ్బలాడి, యవనిపతి హేలఁ బురవీధి నరుగువేళ. 59

ఉ. రాజమహేంద్రుఁ డైనకుశరాజుఁ గనుంగొన మింటనుండి య
వ్యాజమనోహరాంగు లగునచ్చరలే భువి కేగుదెంచి రీ
రాజ నటించుఁ దోఁపఁ గరభోరులు కాంచిరి నిర్నిమేషసో
త్తేజసదృష్టి నవ్విభుని దేహలతల్ గఱుపారుచుండఁగన్. 60

గీ. పురపురంధ్రులు లాజలఁ బోహళింప, వందిజనములు దండఁ జైవార మిడఁగ
వరుసగా రాజభవనాగ్రభాగభూమి, దరిసి యెలుఁగంగఁ బ్రాఙ్ముఖద్వారసీమ. 61

ఉ. బంగరుపళ్లెరంబులను బట్టి వడిన్ గొనితెచ్చి ముత్త వా
రాంగనలెల్లఁ గప్పురపుటారతు లీయఁ గెలంకులందు రా
ట్పుంగవు లిర్వు రుండి కరముల్ కయిదండ లొసంగ నుత్తమా
తంగసమానయానముల ధారుణినాథుఁడు చేరె సౌధమున్. 62

వ. మఱియును శుద్ధాంతదాసికాజనంబులు కుముద్వతిన్ దోడ్కొని యంతిపురంబున
కరిగినయనంతరంబున. 63

చ. తిరమగుభక్తితోడఁ గులదేవతలన్ గొలిపించి వృద్ధలా
గురులకు నెల్లబాంధవులకున్ నతియింపఁగఁ బంపి గౌరికిన్
బరమసమాహితం బయినభక్తిని బూజ లొనర్పఁ జేసి యా
దరమున వృద్ధభామినులు దన్పిరి దీవనలన్ గుముద్వతిన్. 64

చ. అతులితకౌతుకంబునఁ గుశావనిజానియు రమ్యమాళిరా
వతి యనువోలె నేలెడు లవప్రభునిన్ దనసోదరున్ హిత

ప్రీతులఁ బిల్వఁగాఁ బనుప వచ్చె నతండు కరీంద్రసైంధవా
యతపరివారుఁ డౌచుఁ దనయన్నఁ గనుంగొనఁగన్ బ్రమోదియై. 66

వ. మఱియును భరతలక్ష్మణశత్రుఘ్నకుమారులం బిలువనంప వారును సమ్మదంబునఁ దమతమనగరంబులనుండి బాంధవవర్గంబుతోఁ జనుదెంచి రప్పుడు భ్రాతృసప్తకాంరాధితుఁడై యమ్మహేంద్రుండు దిగీశసప్తకంబుచే నారాధింపంబడు మహేంద్రునిం బోలి విలసిల్లుచు సకలబాంధవసమారాధనం బొనరించి విప్రవర్యులఁ బూజించి సత్కరించె నప్పుడు సూర్యుం డస్తాద్రి కేఁగుటయును. 66

ఉ. అంతిపురంబులోన ధవళాంబుజనేత్రలు చంద్రమశ్శిలా
త్యంతనుతంబు కేళినిలయంబు నలంకృతి సేసి యయ్యెడన్
వింత జనించుదంతపుఁబనిన్ దగుమంచముపై హొరంగుఁబూ
బంతులదొంతులన్ జిలుఁగుఁబానుపుపై రచియించి మించుగన్. 67

క. నిద్దంపుఁదళుకు లీనెడు, నద్దంబులతోడ సలిలయంత్రంబులతో
నుద్దీపిత బు లగువి, ద్యుద్దీపవ్రజముతోడ నొప్పఁగ నందున్. 68

క. పలుతెఱంగు లైనచిత్తరు, వుల రతనపుమేలికీలుబొమ్మల యంత్రో
జ్జ్వలతాళవృంతచయముల, నలరించిరి కేళిమందిరాంతరభూమిన్. 69

వ. మఱియును 70

సీ. మృగనాభిపంకంబు బుగబుగల్ గలవీణాతాళితోఁ బన్నీటికోవితోడ
సలలితోశీరస, మ్మిళితచందనరసాలుకలతో హేమమాలికలతోడ
నభినవస్ఫుటితంబు లైమించువిరజాజి, విరులతోఁ గ్రొత్తయత్తరులతోడ
నమలకర్పూరాదికామోదవస్తుజా, తములతో నాకుమొత్తములతోడ
గీ. వలపుఁ గురిపించు మేలిజవాదితోడ, నభినవము లగుమధురభక్ష్యములతోడ
చెలువు మీఱఁగఁ దాంబాళములను సరది, తెచ్చి యుంచిరి చెలులు తద్గేహమునను

వ ఇవ్విధంబునఁ గేళిమందిరం బలంకరించినంత 72

ఉ. రాజితశీతకాంతిరుచిరం బగువెన్నెలబైటఁ బూర్ణిమా
రాజనిభాననాళి మధురంపురసాన్నముఁ దెచ్చిపెట్టఁగా
భోజన మాచరించి నరపుంగవమౌళి మనోజ్ఞకేళికో
త్తేజితమందిరంబు సముదీర్ణతఁ జేరి వసించియుండఁగన్. 73

గీ. సరసభాషలతోడ హాస్యములతోడ, సారరుచి మీఱు మధురహాసములతోడ
నధికహర్షంబుతోడఁ జంద్రాస్యలెల్ల, నురగవరపుత్రిఁ గై సేసి యుంచి రంత. 74

వ. వివిధ కాంచనరత్నభూషణభూషితాంగియు సుగంధబంధురద్రవ్యద్రవ్యగుణీకృతనిజ
శరీరసౌరభ్యసంశోభితయుఁ బుష్పమాలికాజాలలాలితవేణికాభిరామయు నై లజ్జా
భయంబులు గదుర వినమ్రవదన యై యొక్కయెడ నిలువంబడియున్న కుముద్వతిని
సఖీజనంబులు కేళిగృహంబునకున్ దోడ్కొని చని దంపతులకుఁ గప్పురంపుటారతు
లిచ్చి కర్పూరతాంబూలంబు లిప్పించి, 75

కం. సడిసన్న నొక్కరొక్కరు, పడఁతుక లెల్లను పని నెపం బిడికొనుచున్
వ్వెడలుతటిఁ గుముద్వతియును, గడఁగి వడిన్ వెనుక రా నొకర్తుక గేలిన్. 76

కం. తగుఁదగును జాగు సేయక, మగువా! యిటు నిలువు మనుచు మానితరత్న
స్థగిత మగు తద్గృహంబున, దిగవిడిచి కవాటమున్ గదించి చనంగన్. 77

ఉ. ద్వారముచెంత నాననము వంచి భయద్రుతసంభ్రమం బెసన్
గూరుకొనంగ నక్కుసుమకోమలి యచ్చటె నిల్చియుండఁగా
భూరమణుండు కొంతవడిఁ బోనిడి మన్మథసద్వ్రతైకదీ
క్షారతిఁ జేసి యక్కుసుమకల్పితతల్పము డిగ్గి మెల్లనన్. 78

కం. బాలామణికేలిం గొని, లాలితతల్పామలస్థలమునకుఁ దిగిచెన్
గీలించె మరుఁడు వింటన్, వాలాయము గాఁగ సత్ప్రవాలాశుగముల్. 79

ఉ. కరము గ్రహించువేళ మయికంబు జనింపఁగ నంతకంత కే
మెఱుఁగని దయ్యెఁ జిత్తమున నేగతి నెందు వసించియున్నదో
యరయఁగ నేర దయ్యెఁ గుసుమాయుధబాణపరంపరాహతిన్
బరవశ యౌచు ముగ్ధమనఃపటుతాగతు లిట్టివే కదా. 80

ఉ. పానుపుఁ జేర రాఁ దిగిచి భావరసజ్ఞుఁడు మానవేంద్రుఁ డ
మ్మానినిఁ గౌఁగిటన్ జొనిపి మత్తమధువ్రతభాసురాలకా
శ్రీనిహితాననాబ్జముఁ జలింపక ముద్దొసరించె బాలయున్
దా నటుఁ గన్నులన్ మొగిచి నాథునురస్థలి వ్రాలె సిగ్గునన్. 81

వ. ఇవ్విధంబునఁ గొంతవడి విహ్వలాంతఃకరణు లైయుండి యనంతరంబున. 82

ఉ. చక్కిలిగింత నెమ్మదికి జాదుకొనంగను మోవి మోవిఁ జే
రక్కున నక్కదారిచి ప్రియంబున నొండొరుబాహువల్లులన్
జిక్కఁగఁ బట్టి కేళిగతిఁ జెంది రవేలసుఖోన్నతస్థితిన్
జొక్కుచు నద్ధతిన్ బెనఁగుచున్ మనుజక్కవజంటపోలికన్. 83

మ. అనభిజ్ఞాతనియాతయామసమయం బత్యంతిదంతక్షతం
బనతిప్రౌఢ మసంగతార్థవచనం బక్లిన్నగండస్థలీ

ఘనిపాతివ్రత్య మంబనం బతులితప్రేమైకధామంబుగా
దానశ్శ్రీయుచిరంబు నయ్యెను దదీయం బౌరతం బయ్యెడన్. 84

క. సరససమీరమున్ గొలుప జంత్రిప్రవీడన లోలిఁ బట్టుచా
లయనను వ్రేలుచైందవశిలాతతిఁ జాలనివిష్టచంద్రికన్
గరఁగి పయిన్ స్రవింపఁగ సుఖస్థితిఁ జెంది రతిశ్రమంబు వోఁ
దరుణియు ధారుణీంద్రుఁడును దల్పమునన్ నిదురించి రంతటన్. 85

వ. ఇవ్విధంబునఁ గొంతవడి నిదురించినంత నిశాంతసమయం బగుటయు. 86

వ కొలఁకులనుండి వారిలవగుంఫితశీతలవాతపోతముల్
మెలమెల వీచె నీడముల మేల్కని లేచి శకుంతసంతతుల్
కొలకొలఁ గూసె జక్కవలకున్ మదిఁ గల్కులు వాసెఁ దారకల్
వెలవెలఁ బాఱె నంత కనువెల్గునఁ దూరుపు రేక లారఁగన్. 87

వ. అట్టిసమయంబున. 88

ఉ. నాథునికన్న మున్న లలనామణి మేల్కని తన్ముఖోల్లస
ద్దీధితిసంతతిన్ దనివి దీఱఁ జకోరము గాఁగఁ జూచి దీ
ప్తాధికలీలఁ గౌఁగిళులయందలి కేల్విడిపించి క్లాంతమా
లాధరవేణి వ్రేల మృదులం బగుతల్పము డిగ్గి మెల్లనన్. 89

గీ. చెంతఁ గల నిల్వుటద్దంబుఁ జేరి చూచి, చెక్కులం దంటికొన్న కెంజిగిమెఱుంగు
దమ్ములపుముద్రన్ విశదముగఁ దుడిచి, చిక్కువడియున్న హారముల్ చక్కఁజేసి

చ. చెదరినపయ్యెదన్ సవరి చెక్కులఁ గూరినకుంతలంబులన్
బదిలముగాఁగఁ దిద్ది పువుఁబాన్పునఁ బండినయాత్మవల్లభున్
మృదులకటాక్షవీక్షణసమృద్ధము లౌ నరమోడ్పుఁగన్నులన్
వదనముఁ ద్రిప్పి కన్గొనుచు భామిని యవ్వలి కేగె వేగునన్. 91

వ. ఆసమయంబున మహీనాథుండును లేచి కాల్యకరణీయసంధ్యాదికృత్యంబుల నిర్వ
ర్తింప నరిగె ననంతరంబున. 92

ఉ. తూరుపుదిక్కునాఁ బరఁగు తొయ్యలి మేన నలంకరించి యిం
పార ధరించుచీరతొగరంచుల మించు లనంగఁ బ్రాచిపై
రుణరేఖ లొప్పఁగఁ దదంగన నెన్నొసటన్ దలిర్చు సిం
దూరపుఁజుక్క నాఁ బొడిచెఁ దోయజబాంధవుఁ డిద్ధతేజుఁడై. 93

గీ. అంతటఁ గుమారుండు నిజబాంధవాదిజనుల, సోదరావళి సుబహుమానాదరములఁ
గాంచి కవిసంఘకవిజనుల గని, వారి వారిదేశంబులకు మహదావహులఁ జేసి. 94

# శ్రీకుముద్వతీపరిణయము.

ఇవ్విధంబున నారాజన్యుండు ప్రాజ్యసామ్రాజ్యవైభవుండై కుముద్వతీసతి యసమానమానితధర్మక్రియంబున రాజ్యంబు సేయుచు సుఖంబుండె.

ఉ. అనుపమమోదలీల లుదయంబును జెంద వినిర్మలైకభా
వనఁ దనముద్దుచెల్లెలి వివాహకథానక మాట దీని వ్రా
సిన గ్రహియించినన్ వినినఁ జెల్వమెయిన్ గుముదుండు సర్పసం
జనితభయంబు వాపి వసుసౌఖ్యయశస్సుమమాలిఁ గూరుచున్.

క. అతులిత నిజతనయపవి, త్రితరచరిత్రం బటంచు రామప్రభుఁడున్
గృతికర్తను గృతిభర్తను, వితతసుఖాయుర్యశోభివృద్ధిన్ దనుపున్.

ఆశ్వాసాంతము.

కామక్రోధవివర్జనక్షమకళాకౌశల్య! నైర్మల్యసు
శ్రీమాన్యాత్మ! శమాదిసద్గుణగణాశ్రీ వైకబోధోల్లస
త్సామగ్రీసముదగ్ర! నిర్దళితవాంఛాసంచితాడంబరా!
భూమిఖ్యాతచరిత్ర! పావనజనుఃపూర్ణప్రశంసావహా!

అసమానపౌరుషాధిక, లసమానగభీరతావిలాసస్ఫురణా!
అసమాననసేవనమా, నసమాననగుప్తదానసనయసంభరణా!

దకవృత్తము. వీతభవార్తి! పవిత్రితమూర్తీ!
పూతసుశక్తి! యమోఘతరోక్తీ!
ఆతతసత్త్వ! సమాత్తమహత్త్వా!
ద్యోతితశీల! మృదుత్వవిశాలా!

గద్యము:

శ్రీవాలఖిల్యపవిత్రగోత్రోద్భవ వేంకటరత్నాంబికా
బాపనార్యతనూభవ వాంధ్రగీర్వాణభాషాసనాథ
ద్విభాషి సోమనాథకవిప్రణీతం బైన
కుముద్వతీపరిణయం బను
మహాప్రబంధంబునఁ
బంచమాశ్వాసము
సర్వంబును
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

# తప్పొప్పుల పట్టిక.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 11 | కళయూవోఠ | కళయుఁబోతె |
| 8 | వంగబంగాళాది | వంగకాశ్మీరాది |
| 10 | శృతి | శ్రుతి |
| 9 | మోహానకలాకలాపకలాపకలనా | మోహానకలాకలాపకలనా |
| 27 | యంతటి | యెంతటి |
| 29 | మించు | మించి |
| 14 | నందవిశేషము | నందలిచిత్రము |
| 16 | యమకేంద్రుబల్కుటయూ | యమకేంద్రుతోఁబలుక |
| 26 | ఘనసౌఖ్యలీలకున్ | ఘనసౌఖ్యజాలపుం |
| 1 | గచ్చడల | గచ్చలను |

---